1937 ...

# విషయసూచిక




కోకోనలు మీ తలవెండ్రుకలను సన్నగ నల్లగ, మృదువుగ, ప్రకాశముగ ఉండేటట్టుచేస్తుంది. ఏ స్త్రీయైనా, తలవెండ్రుకలు చక్కగాలేకపోతే, అందముగ కనుపించదు. తనజుట్టు నిడుపుగ మెత్తగ, సన్నగ, నల్లగ ఉండాలంటే కోకోనలు ఎల్లప్పుడు ఉపయోగించాలి.

కోకోనలు నెత్తిని శుభ్రముగనుంచి చుండు పట్టకుండచేస్తుంది. చిన్నతనమున తలనెరియుట, దువ్వుకొనునప్పుడు వెండ్రుకలురాలిపోవుట, మున్నగువాటిని ఆపుతుంది.




కోకోనలు శుభ్రమైన కొబ్బరినూనెనుండి తయారుచేయబడినది. దానిలో నెత్తికిని మెదడుకును, తలవెండ్రుకలకును మంచిపనిచేయు మూలికలసారము కలిసివుంది. కోకోనలు వాడి తలవెండ్రుకలను చక్కగను దువ్వుకొనుట కనుకూలముగను చేసుకొనండి.

## కోకోనలు

కలకత్తా కెమికలుకంపెని లిమిటెడ్ వారిచే తయారుచేయబడినది.



## యింతలో యింత ఆరోగ్యం!

"మొన్నటికి ముఖమంతా పాలిపోయి వాల కేశావ్. యింతలో యింత ఆరోగ్యం! అది యెలా సాధ్యం?"

"అదే చెప్పుకో!"

"ఇదివరకు నే చెప్పినమందా?"

"కాదు"—

"ఏదైనా ఇంగ్లీషుమందా?"

"కా—దు"

"యునానీయా?"

"కా——దు"

"మరి—?"

"లోధ్ర. పొరిగింటావిడ యిచ్చింది. పుచ్చుకున్నాను నాలుగు మోతాదులు. దాన్తో కడుపునొప్పి మట్టుకట్టు అదంతా మాయమై పోయింది."

గర్భాశయ రోగములను పారద్రోలి ఆరోగ్యమును ప్రసాదింపగలది "లోధ్ర"

కేసరికుటీరం — రాయపేట — మదరాసు

# విషయసూచిక



త్రివర్ణ చిత్రము

దీనదేవతలు — చిత్రకారుడు: టి. భీమరావుగారు.

# విషయసూచిక



త్రివర్ణచిత్రము—కావేరిజననము    చిత్రకారుడు: శ్రీ సి. ఎస్. వెంకట్రావుగారు.

ఈ సంచికలో

'మనసులో మాటలు' అందఱిమనసులోని కెక్కతగినవే. మహిళాపతాకను గూర్చి రాజోవు రాష్ట్రీయ మహాసభలో ప్రవేశపెట్టి యుక్తరీతి తీర్మానింపవలసియున్నది.

నూతనముగా గనిపెట్టబడి గృహపరిశ్రమల కెక్కుడుగా నుపయోగపడునట్టి సామానులను గూర్చి తెలిసిన పాఠకులు 'గృహలక్ష్మి' ముఖమున ప్రకటింప ప్రార్థితులు.

*　　*　　*　　*

ఆదర్శప్రాయులగు గృహిణు లెంతమందియో యుండవచ్చును. వారు గృహమును సౌఖ్యకరముగ చేయు పద్ధతులు భిన్నముగ నుండవచ్చును. వారి యాదర్శముల నితరుల కేందులకు దెలుపరాదు? ఇందలి 'ఆదర్శగృహిణి' అట్టివారి కుత్సాహముగలిగించుటకే.

*　　*　　*　　*

అవసరమైనను, అనారోగ్యదాయకమైనను, ఆదాయమున్నను లేకున్నను కొన్ని యలవాటుచేసికొని పరిస్థితులు తారుమైనపుడా అలవాటులను వీడజాలక కష్టపడుచుండు వారలను 'మింగను మెతుకులేకపోతే మీసాలకు సంపంగినూనెందుకు' అని ప్రశ్నింపవలసి వచ్చును.

*　　*　　*　　*

కాటికి కాళ్లుచాచుకొనియున్న బోసినోటితాత అవసానకాలములో తన సౌకర్యములు గమనించుటకు వివాహమాడవలయునన్న అదే పరిస్థితులలో, అదే వయసులో అదే యిచ్ఛలో ఒక అవ్వకూడ ఆ అభిప్రాయము వెల్లడించుట తప్పగునా అను సాహసముతోడి ప్రశ్నకు జవాబు 'ఎత్తుకుపైయెత్తు.'

*　　*　　*　　*

సాంసారిక జీవనములో సతీపతులుమధ్య యెట్టి భేదాభిప్రాయములు కలుగకుండుటకుగాని సంసారము చెన్నగా సాగుటకుగాని యీ పద్ధతులే అవలంభింప వలయునని యెంచుటను నిర్ణయింపబడలేదు. సతీపత సమయానుకూలముగా ఒకరినొకరి నర్థముచేసిక నడచుకొనుటే ముఖ్యము. 'సౌఖ్యకరమగు సంసార లో దీనికి కొన్నిసూచనలుగలవు.

*　　*　　*　　*

'బాల్యక్రీడలు' నూతనముగా ప్రారంభింపబడి 'గృహలక్ష్మి' బాలురకుత్సాహము పుట్టింపవల ననియే బాల్యక్రీడలు చిత్రపటములతోకూడ చేర్చ నవి. పిల్లలకు వీని వివరములు బోధించి వా నీయాటలనాడించుట సోదరీమణుల విధి.

చదువుల రామచంద్రయ

---

## దసరా సంచిక

అక్టోబరు మాసారంభమున గృహలక్ష్మి యెప్పటివలె వెలువడును. అంద స్త్రీలచే రచింపబడు పద్యగద్యవ్యాస ములు మాత్రము ప్రకటింపబడును. దీని కాంధ్ర విద్వత్సోదరీమణులందర తోడ్పడి ఈదసరాసంచిక సర్వాంగసుంద రముగా వెలువడునట్లు చేయుదురని ప్రార్థించుచున్నాము.

వ్యాసములు సాధ్యమైనంత క్లుప్తముగ నున్న మంచిది. వ్యావహారికమునైనను గ్రాంథికభాషయందైనను నుండ వచ్చును. కథలు, పద్యములు, విమర్శ నలు, రాజకీయ ఆర్థిక, సాంఘిక, నైతిక ఆధ్యాత్మికాది వివిధవిషయములను గూర్చిన వ్యాసములుకూడ ప్రకటింప బడును. వ్యాసములన్నియు ఆగస్టు మాసాంతములోపలనే మాకార్యాల యమునకు చేరవలయును.

సంపాదకుడు.

# విషయసూచిక

# విషయసూచిక

వారల యాచారవ్యవహారములను తీర్థయాత్రాస్థలములను గూర్చి వివరములను దెలుపు వ్యాసములను తాము చూచినవి చూచినట్లు వివరములతో వ్రాసి పంపుదురని మనవి. విదేశములకు గూడ వెళ్లి యచ్చటి పరిస్థితుల నెల్ల గమనించివచ్చిన సోదరీమణులు వానినిగూర్చిన విపులమగు సంగతులు వ్రాసిన గృహలక్ష్మి యాదరముతో ప్రకటింపగలదు. యాత్రలు విదేశప్రయాణములు చేయజాలని వారలకెల్ల యిట్టి వ్యాసము లుపకరించునని మెతిసోదరీమణులు తాము చూచిగొన్న యనుభవములను గృహలక్ష్మిముఖమున యాంధ్రనారీమణులకు దెలుపుదురుగాక.



## ఆశీర్వాదము

మ॥ మహితార్థాన్వయ వాగ్విశేషముల సన్మాన్యాతి తేజమ్ముతో
మహిళాలోకము ప్రీతినేర్చికొనఁగా మాత్సర్యమున్వీడి స
ద్గృహిణీరత్నము లెల్లకాలమును నిర్వర్తింప సత్ప్రీతితో
మిహికాగాత్మజ భర్తనీకు గృహలక్ష్మి యిచ్చిపాలించుతన్.

సీ॥ గృహలక్ష్మిమామక గృహమున కెప్డు దేలెంచునో యనుచు ధ్యానించువారు
గృహలక్ష్మిసుందర కీర్తిక్షీరసముద్రమందు మత్స్యములై యలరువారు
గృహలక్ష్మియనికము గృహిణీజనాళ్యంత క్షేమకరంబని చెప్పువారు
గృహలక్ష్మికే. నరసింహకేసరి యావిధమ్మునఁ బ్రకటింపఁదనరువారు

తే॥ గీ॥ గలుగ విలసిల్లుచుండువు కౌతుకమున
జయమునీకగు గృహలక్ష్మి జయముజయము
తనరుఁగావుత మాచంద్రతారకముగఁ
బ్రతిభ గృహలక్ష్మి విష్ణునివరమకరుణ.

బులుసు కాశీఅన్నపూర్ణ.

# నమోవాకములు

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు

గీ॥ అవియె శ్రీకృష్ణదేవరాయాగ్రగణ్యు, పాలనమ్మున గుండెలపైన జేతు
లిడికొని వెఱపెఱుఁగక నెమ్మితో జనులు,దమ నిదురగొన్న బలుప్రశాంతపుదినాలు.

గీ॥ తెనుఁగుకైతలు బలుసిగ్గుదేరి కవులు, తెలుగునుడికారమున భావములను మేళ
గించి రసవత్ప్రబంధంపు పంచికలును, వెలువరించిన బహువెలగల దినములు.

చం॥ ఇటురసిద్ధులైన సుకవీంద్రులు పెద్దనసూరనాదులున్
పటుతరశాస్త్రవేదులగు పండితవర్యులు లక్షణజ్ఞులు
న్స్ఫుటపువివాదయుక్తి నగుతార్కికశాస్త్రధురీణులెల్ల సం
తత నలరార రాయలుముదంబున గొల్వును దీరెనుద్ధతిన్.

సీ॥ ఆంధ్రవాఙ్మయలక్ష్మి యలర రాయలగూడి దోబూచులాడిన తోటసాలు
తెనుఁగుకైతలు సిగ్గుదేరి తేనెలసోనల్ బొలుపొందగురిసిన పూలగుత్తి
తెలుగుమహాకావ్యముల బ్రియంబిగురొత్త కనిపెంచికొన్నట్టి కన్నతల్లి
ఆంధ్రభాషాసేవయను విత్తుమొలిపించి ఫలమొసంగినయట్టి పంటపొలము

గీ॥ కవికుమారుల కెల్ల స్వాగతములిచ్చి, సత్కరించుచు నాంధ్రభాషావధూటి
యాదుకొన్నట్టి పొలమన నందమొలుక, నుండు రాయలకొలువున నొక్కనాడు.

గీ॥ కవితనేర్చినందుకుగల ఫలంబు, గాగ రామునిమనసార గంతమెత్తి
పాడికొని ధన్యయైనట్టి బరమసాధ్వి, యొసగుచుండె మహాకవయిత్రి మొల్ల.

గీ॥ చీమునడచినశబ్దంబు చెవులబడదు, నట్టులున్నట్టి రాజసభాంగణమున
పద్దెమొక్కటి వినిపించె పెద్దనాదు, లక్కజంబంది రంతన హాయటంచు.

ఉ॥ రాయలకొల్వులోని కవిరాజులమధ్యననిల్చి ధీరతన్
బాయక నాతుధాన నొకపద్దెముసెప్పిన సభ్యులందరా
హాయనజేసినట్టి కవితామృతవృష్టియు భావపూర్ణభా
షాయుతవాక్ప్రపూరమును సాధ్విరో! నైజములయ్యె నీకికన్.

గీ॥ కవికుమారుల ముగ్ధులగానొనర్చ, నేర్పుగల కవితాజ్యోతి నిర్ణయింప
నకటబ్రతిష్ఠమైయుండియొక తెనుంగు,తరుణి చిలుఁబొజ్జయుం డెందు దాగియుండె?

గీ॥ మొల్లకవయిత్రి యాదర్శముగ వెలంగ, లేఖినులనింక సమ్మదలీలద్రిప్పి
తెనుగుగృహలక్ష్ములార పద్దెముల మీరు, చిలుకరింపుడు కుసుమపేశలమృదూక్తి.

గీ॥ మొల్లకవయిత్రికింక సమ్మోదమలర, ధన్యవాదమునర్పింప ధన్యనగుదు
ననుచు దత్కార్యమొనరింప నాశగల్గు, తెలుగుగృహలక్ష్మి గర్వింపవలయుగాదె.

# మహిళామణుల మహోన్నతవిజయములు

తన పదియవ జన్మదినోత్సాహముతో వెలువడు నీ సంచికయందే భారతనారీమణులు సాంఘిక రాజకీయములందు గడించిన విజయములనుగూర్చికూడ వ్రాయవలసిన యవసరము గల్గినందులకు గృహలక్ష్మి మిగుల నానందించుచున్నది. స్త్రీల యభ్యుదయమునకై బద్ధకంకణయై వెలువడుచుండు నీ 'గృహలక్ష్మి' కేగాక యెల్ల గృహలక్ష్ములకును ఇట్టి విజయములు మిగుల శుభసూచకములు; భావి భారతమహిళాసంఘాభివృద్ధికి సోపానములు.

మొన్న మొన్ననే భారతశాసనసభయందు హిందూస్త్రీలవారసత్వపుహక్కు శాసనమైనది. దీనితో హిందూ స్త్రీలు యికమీదట బాగుపడెదరను దృఢనమ్మకమునకు చోటుదొరికినది. ముఖ్యమైన ఆర్థిక హక్కును స్త్రీలందరు పొందినచో నితర హక్కు లెంతోదూరముననుండవు. దీనితో నితర హక్కులను సంపాదించుట కూడ సులభము.

సాంఘికముగా నీరీతి భారతస్త్రీ యభివృద్ధిబొందుచుండ రాజకీయముగా నామె స్థితి బాగుపడుటకు నూతనసంస్కరణము లోకవిధముగ త్రోవజూపినవి. అనగా నూతన సంస్కరణములవలననే హిందూ స్త్రీలకు గావలసిన హక్కులనియు కరస్థమైనవని దలంచుటగాదు. వారీ యవకాశమును పురస్కరించుకొని శాసనసభలందు ప్రవేశించి యితరహక్కులకై పోరాడవచ్చును. ఈ నూతనసంస్కరణముల ప్రకారము జరిగిన శాసనసభల యెన్నికలందు కాంగ్రెసువారు నిలిపిన స్త్రీయభ్యర్థులన్నిరాష్ట్రములందును అఖండవిజయులైనారు. స్త్రీ ఓటరులు తమ విధులను చక్కగా గుఱితించి బాధ్యతల శ్లాఘనీయముగా నిర్వర్తించినారు. ఇంతకంటె భారతనారీయభ్యుదయమునకు శుభసూచకమేమ్యది ?

ఆంధ్రగృహలక్ష్ము లీ సమయమున గర్వింపదగిన విషయ మింకొకటి గలదు. ఈరాష్ట్రమున స్త్రీ నియోజకవర్గములలో గెలుపొందిన నారీమణులలో శ్రీమతి రుక్మిణి లక్ష్మీపతిగారి నెఱుగని యాంధ్రులుండరు. వారు నిలచిన ప్రతియెన్నికలలోను అఖండవిజయులగుచు వచ్చెదరనుట నిది ధృఢపరచినది. వారు సోదరీమణుల స్థితిని, వారి కొరకు సల్పవలసిన కృషిని యెఱిగినవారు. కాన వారి యభివృద్ధికై నాయకత్వము వహించి పాటుబడుదురని వేరుగా వ్రాయబనియుండదు. వారు తమ కార్యక్రమమందీ విధముగా విజయులగుచుందురు గాకయని కోరుచున్నాము.

# ప్రశ్న పద్యము

సీ॥ అష్టాక్షరంబుల ♦ నమరునామంబొండు,
స్త్రీలోకముఖ్యమై ♦ చెలగుచుండు
మూఁడునేడులజాడ ♦ చూడగానొకపక్షి
నై దుకనుగొనంగ ♦ నగుహుళిక్కి
అంత్యపంచమమారు ♦ నలరునుపాత్రము
మూఁడుచివరరెండు ♦ కూడగణము
ప్రథమపంచమమారు ♦ పరగుచోద్యపురీతి
నాల్గంత్యరెంటిలో ♦ నలరుజాతి

గీ॥ ఒండునారునేట ♦ నొనరునులోకంబు
మూటనారుగూడ ♦ కీటకంబు
రెండునంత్యరెండు ♦ మెండుగారత్నంబు
చెలగునామమేమొ ♦ తెలియవలయు.

## గమనింపు

ప్రశ్నపద్యమునకు సమాధానమును ప్రక్క కనుపరచిన కూపనునందు వ్రాసి మార్చి 15వ తేదికి ముందే చేరునటుల పంపవలయును. ఆవిధముగ మాకు మొదటిచేరిన సరియగు సమాధానమును వ్రాసినవారికి గృహలక్ష్మి పత్రికను ఉచితముగా నొక సంవత్సరము పంపబడును. తరువాత వారి నామములును, బహుమతి విషయమును రాబోవు సంచికయందు ప్రకటింపబడును. ఈపోటీకి ప్రవేశరుసుము మేమియు లేదు.

గృహలక్ష్మి చిత్రప్రశ్న

సమాధానము..............................

పేరు..............................

చిరునామా..............................

గృ. ల. 1

ఒక అనాథయైన దిక్కులేని బాలిక

ఎల్లరిచే నిరసింపబడి ... పెక్కుమందిచే బాధింపబడి

# తెలుగు బాలయోగినిలో



పరమాత్ముని సజ్జ చేరుచున్నది.

ఆమెను చూడుడు—ఆమె ధరించిన బాలసరోజ.

ప్రస్తుతము మద్రాసు

## క్రౌన్ టాకీసుకు

రానున్నది.

మఱువకుడు! ఇది మద్రాసు యునైటెడ్ ఆర్టిస్టిస్ వారు తయారుచేసినది.

బెజవాడ, విశాఖపట్టణము, కాకినాడ, తెనాలి, గుంటూరులలో

## విడుదల తేదికై నిరీక్షింపుడు

☞ వివరములకు:

ది మహాలక్ష్మి స్టూడియోస్ లిమిటెడ్,

110, రాయపేట హైరోడ్, రాయపేట, మద్రాసు.

# విషయసూచిక

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. బి. మనోహరరావుగారు.
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.
హైదరాబాదు: ఎస్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు. (పెద్దబావిడిదగ్గర)
తాడేపల్లిగూడెం: కాశీరాజు శ్రీరాములుగారు. నూజవీడు: వి. ధనంజయ అండ్ కంపెని.
జెమ్షెడ్పూర్: వి. కొండల్రావుగారు, అకౌంట్సు ఆఫీసు.
గుంటూరు: వెల్కం అండు కంపెని.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు.
పిఠాపురం: ఎం. సూరిరాజుగారు, ఆంధ్ర న్యూసఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
సికందరాబాద్: శ్రీరామా బుక్ డిపో. బరంపురం: ఎస్. కె. మూర్తి అండ్ సన్సు.
తణుకు: నడుపల్లి సూర్యనారాయణగారు, న్యూస్ఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్పేట.
ఒంగోలు: తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు.
చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.
నరసాపురం: వై. సుందర రామయ్యగారు.
నిడదవోలు: కొవ్వూరు: కె. సి. చెన్న కేశవయ్యర్ గారు.
భీమవరం: వంగల అచ్యుత రామయ్యగారు, మేనేజరు, అశ్విన్ కుమార్ ఫార్మసీ.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.
అమలాపురము: పి. అన్నాజిశర్మగారు. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)
మచిలీపట్టణం. ఆచంట లక్ష్మీనరసింహంగారు, రాజుపేట.
కర్నూలు: టి. బాలనాగయ్య శెట్టిగారు, బాలసరస్వతి బుక్ డిపో.
కడప: ఎమ్. నరసింహంగారు, న్యూసుఏజంటు.
కాళహస్తి: యస్. అబ్దుల్ అజీజ్ సాహెబ్.
పొన్నూరు: జి. సూర్యనారాయణగారు,
విజయనగరం: ది. పాపులర్ ట్రేడింగ్ కంపెని, కస్బ.
పర్లాకిమిడి: బండారు నరసింహామూర్తిగారు, న్యూస్ ఏజంట్.
రేపల్లి: పి. సి. కన్నభిరామ్ శెట్టిగారు, న్యూస్ ఏజంట్.
మదనపల్లి: ఎన్. రాధాక్రిష్ణయ్య శెట్టిగారు, న్యూస్ ఏజంట్.
ఖరగ్పూర్: ఎస్. ఆంజనేయులుగారు, ట్రాఫిక్ సెటల్మెంట్.
చీరాల: ఎ.ఎస్. ఆర్. ఆంజనేయులుగారు.
ఏలూరు: ఆర్. జగన్నాథం అండ్ సన్సు, ధన్వంతరాలయం.
రాజోలు: దినేషనల్ న్యూస్ ఏజన్సి.
నెల్లూరు: కె. శ్రీరాములు, న్యూస్ ఏజంట్.

హిగిన్ బాతమ్సు స్టాలులవద్ద దొరకును.

# వి ష య సూ చి క

"శా. అంధుండెక్కడ! చంద్రుఁడెక్కడ! తదీయంబైన యావర్ణనా
బంధంబెక్కడ నిట్టివింతగలదే! భావింపనెచ్చోటనై
నం ధాత్రీంద్రుఁడు మాకు నిర్వరకునందంబొప్ప నశ్వర్యవ హ్వా
త్సంధానంబగు నంచుచేసి నిటులం జర్చింప వేరున్నదే?

క. ప్రతిభంగమయినగానీ, మతిమంతు నుదాత్తవేషు మానితవిద్యా
న్వితునిం గాంచెదఁ గన్నుల, కతుల మహోత్సవముగాఁగ ననిచెలిప్రీతి

సీ. ..........................................

తే. పకియు మదినెంచి తమిమించి సంభ్రమించి
కరములలరించి తెలివంచి కందళించి
పొంచి తిలకించి పులకించి పొలుపుగాంచి
కాంచెరోహిణి చంద్రుని కాంచినట్లు."

—విల్లేయము

# గృహలక్ష్మి

## స్వవిషయము

శ్రీయాత్వం పార్వతీయాత్వం సరస్వతీయా స్త్వశ్రీ లేశసంజాత లా
జ్ఞాయాత్మల్ హరిరుద్రవిరించి ధవాద్యాదిత్య సంఘమ్ము లే
మాయాతీతకు జేజగజ్జనని కే మాత్రాస్వరూపాఢ్య కే
ధ్యేయం ప్రౌఢ మహాప్రశక్తి కతిభక్తిన్ గొల్తు మిష్టార్థికిన్.

— దేవీభాగవతము.

ఈ మాసారంభముతో గృహలక్ష్మికి తొమ్మిదవయేడునిండి పదియవసంవత్సరము ప్రారంభించినదను విషయము పాఠకలోకమున కానందదాయకముగా నుండకపోదు. తమచిరుతసోదరి యాశయములకు దగినరీతి యాకృతికి హితవగులీల నాకర్షనీయములగు చిత్తరువులచేతను, రమణీయమై రసవంతమగు రచనలచేతను నలంకరించి యాదరించిన యాంధ్రలోకము కెల్లహృదయపూర్వకమైన కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నారము. ఈ యాంధ్రలోకాదరణ 'గృహలక్ష్మి'కి గల యుత్సాహము నినుమడింప జేసి తానిదివఱకు స్త్రీల యభ్యుదయమునకై పాటుపడు ప్రదేశమును విస్తరించు నుద్దేశముతో నొక తమిళసోదరీమణిని తోడుగాగైకొని 1937 వ సంవత్సరము జనవరి మాసమునుండి వెలువడుచున్నది. ఈ యాదరణ నింకను విరివిగావించి తనకార్యసాఫల్యతకు తోడ్పడ నందరిని యాచించుచు సోదరి కెంగేలు మోడ్చుచున్నది.

ప్రపంచపరిస్థితులను పరికించినచో నిప్పుడొక నూతనయుగ మారంభమగుచున్నదని తెలియకపోదు. శతాబ్దములనుండి యూనువంశికముగా వచ్చుచున్న రాజ్యములంతరించుచున్నవి. ప్రపంచమంతటిని కట్టుదిట్టముల నుంచుచువచ్చిన మతసంస్థలప్రభ మరుగుపడుచున్నది; రాజకీయములు నూతనత్రోవ త్రొక్కుచున్నవి; సాంఘిక పరిస్థితులు మారిపోవుచున్నవి; ఆర్థికపు టేర్పాట్లు తలక్రిందులైనవి; నీతినియమములు మానుమత్వమునకు మర్యాదనిచ్చుచున్నవి. ఒకటననేల! ప్రపంచమే క్రొత్తయుగములోనికి ప్రవేశించుచున్నది. కలనైన దలంపని నూతనపద్ధతులు ప్రచారములోనికి వచ్చుచున్నవి. దీనికి కారణములై యంతర్భాగములైయున్న శక్తులు భారతదేశమునకు దూరముగనుండుటలేదు. ఈ మార్పులను గురించి యే ధర్మశాస్త్రములందుగాని వ్రాయబడియుండలేదు గాన మనకవి వర్తింపవని భారతమాత యూరకుండజాలదు. కాలమను ధర్మశాస్త్రమే యెప్పటికపుడు కావలసిన నియమముల నాచరణయందు బెట్టుట కుత్తరవు లిచ్చుచుండును. వాని నుల్లంఘించిన తగుశిక్ష తప్పదు. దీని విషయ మటుండనిచ్చినను త్వరలోనే ప్రారంభింపబోవు నూతన రాజ్యాంగసంస్కరణములు నూతన యుగారంభమునకు ప్రత్యక్షప్రమాణములు గదా! రాజకీయములకు సంఘాభివృద్ధికి అవినాభావసంబంధ మగుటయే కారణము.

ఈకారణముచే సంఘోద్ధారకులును, దానికై పాటుపడు పత్రికలును నూతన పంథా — కాలము ననుసరించి దేశమున కుపకరించురీతి — త్రొక్కక తప్పదు. దానిని గమనించి తమయభివృద్ధికై పాటుపడుగృహలక్ష్మి యేయే నూతనత్వము నలవరిచికొనవలసియుండునో దానిని నిర్ణయింపవలసిన బాధ్యత ఆంధ్ర మహిళామణులయందే గలదు. వారందులకు తగిన సూచనల గృహలక్ష్మియందు ప్రకటింపుదురుగాక.

తమ రచనలచే గృహలక్ష్మి నెల్లపు డలంకరించుచుండెడి సోదరసోదరీమణుల కొక విషయమీ సమయమున మనవిచేయుటుత్తమమని యెంచుచున్నాము. కథలు కల్పనలచేత సంఘాభ్యుదయమునకు గావలసిన విషయముల ప్రదర్శించుట నాగరికతా ప్రపంచమున చాలకాలమునుండియు పరిపాటియైనది. కాని వీనికితోడు నేడన్ని దేశములందును యథార్థవిషయముల కెక్కుడు ప్రాముఖ్యము నిచ్చుచున్న సంగతి పాఠకులిదివఱకె కెఱిగియుండవచ్చును. అంతియగాక మానవులందరికి కొన్ని వేళలగలుగు యనుభవములు కథలకంటె కల్పనలకంటె యెక్కుడు బోధకము లగుటయుగలదు. తాము రచించు కథలకు కల్పనలకుతోడుగా నితరులకు పెక్కువిషయముల నేర్పుచు నవరికేని భాధాకరముగాని యథార్థానుభవములను — గృహలక్ష్మికి పంపగలందులకు ప్రార్థితులు. ఇదియుగాక భారతదేశమందితర భాగములందలి

# విషయసూచిక



త్రివర్ణచిత్రము

దీనదేవతలు — చిత్రకారుడు: టి. భీమరావుగారు.

# స్త్రీ విద్య

ఒక స్త్రీవిద్యాభిమాని

జనవరి నెల గృహలక్ష్మి సంచిక యందు పుష్పచయమున పదముూడేండ్ల సోదరి తన నిర్బంధ పరితాపమును వెల్లడించిన సంగతి పాఠకసోదరీమణుల కెల్ల విశదమే. నాగరికతాభివృద్ధి నొందుచున్న నీకాలములో నింకను యిట్లు విలపించు బాలికలు పెక్కురు గలరని చెప్పుకొనుట కెంతయు విచారమగుచున్నది. విద్యాభివృద్ధి నొందుచున్నదనుకొను నీకాలమున బాలురతోపాటు తమ బాలికలకు విద్య గరపించు తలిదండ్రుల సంఖ్య చాలతక్కువ. ఏ పట్టణములందునో ఏకొద్దిమంది బాలికలో విద్యనభ్యసింపబడుట జూచి స్త్రీ విద్యాభివృద్ధి నొందుచున్నదనుకొనరాదు. మన దేశమున పట్టణములకంటె పల్లెలసంఖ్యయే హెచ్చు. ప్రతిగ్రామమునందును బాలికాపాఠశాలలు నెలకొల్పబడినవని సంతసించుటయేగాని అందువిద్య నభ్యసించు బాలికలసంఖ్య యెంతయో అందును ఏనాల్గవతరగతి వరకునో గాక నున్నతవిద్య నభ్యసించుచున్న బాలికలెందరో గమనించిన స్త్రీ విద్యాభివృద్ధి యెంతవరకు జరుగుచున్నదో బోధపడగలదు. ఇందులకు కారణము మనసంఘమునందుగల లోట్లనియే చెప్పవచ్చు. స్త్రీ విద్యగూడదను మహనీయులు, బాలికాపాఠశాలలందు నాటకప్రదర్శనములు (భక్తిరసపూరితములైనవైనను) విద్యాభివృద్ధి సంఘములను నుండుట బాలికల శ్రేయోభివృద్ధికి భంగకరములని వాదించు జనకులు, స్త్రీకి సభయందుపన్యసించి తన భావము వెల్లడిచేయుటకు హక్కు లేదను సోదరులు మన గ్రామములందు పెక్కురుండుటవలననే స్త్రీవిద్య అభివృద్ధి నొందుటకు మారు నశించనై యున్నది. సాహసించి యే యొకరిద్దరు బాలికలనో తలిదండ్రు లున్నత విద్యకై పాఠశాలల చేర్చినచో వారిని పరిహసించి ఇకముందీ బాలికలే యుద్యోగములుజేసి తమ తలిదండ్రుల పోషించెదరు గాబోలునని హేళనచేయు వారు గలరు. వేయేల నుపాధ్యాయులై విద్యాప్రాముఖ్యత తెలిసియుండియు, తాము ప్రబోధించి తలిదండ్రులను బాలికావిద్యాభివృద్ధికి దోడ్పడునట్లు చేయుటకు బదులు, తామే స్త్రీవిద్యను నిరశించుచు, చాటున బాలికలను జదివించు తలిదండ్రుల పరిహసించి దూషించుట మిగుల శోచనీయము. అందువలననే గ్రామములందు బాలికలలో నున్నతవిద్యాభివృద్ధి లేదు. విద్య నభ్యసించినతరి స్త్రీ తనభర్త కెట్టి సహధర్మచారిణియై యుండి తన తోడిమానవులయెడల

ఉపాధ్యాయులై విద్యాప్రాముఖ్యత తెలిసియుండియు, తాము ప్రబోధించి తలిదండ్రులను బాలికావిద్యాభివృద్ధికి తోడ్పడునట్లు చేయుటకు బదులు, తామే స్త్రీవిద్యను నిరశించుచు, చాటున బాలికలను జదివించు తలిదండ్రుల పరిహసించి దూషించుట మిగుల శోచనీయము.

స్త్రీ యెల్లపుడును దినమంతయు గృహములోనే బంధితురాలై యుండవలయు. వీధి గుమ్మము జేరరాదు. అట్లు జేరినవారు కులస్త్రీలు గారు. తోడిమానవుల పరికించగూడదు. దేశపరిస్థితుల దెలిసికొనగూడదు. పత్రికల జదువరాదు. నిర్మల వాయువు పీల్చరాదు. వ్యాయామక్రీడల బాల్గొనరాదు.

నెట్టి యాదరణభావము, వినయము, భూతదయ గలిగి యుండి సద్వర్తనురాలై మెలగుచుండునో పురుషులు దెలియజాలక విద్య నభ్యసించుటచే స్త్రీలు దురాచారములకు లోనగుదురను దురభిప్రాయము గలిగి యున్నారు. 'విద్యయొసగును వినయంబు, వినయమునను బడయు బాత్రత' మొదలగునవి స్త్రీలకు జెందవని కాబోలును వారి యూహ. స్త్రీ యెల్లప్పుడును దినమంతయు గృహములోనే బంధితురాలై యుండవలయు. వీధిగుమ్మము జేర రాదు. అట్లు జేరినవారు కుల స్త్రీలు గారు. తోడిమానవుల పరికించగూడదు. దేశపరిస్థితుల దెలిసికొనగూడదు. పత్రికల జదువ రాదు. నిర్మలవాయువు బీల్చరాదు. వ్యాయామ క్రీడల బాల్గొనరాదు. ఇట్టియూహలతో స్త్రీల మనోవికాశముల నణగద్రొక్కజూచు పురుషుల హృదయనైచిత్ర్య మెంతసోచనీయము! 'కాలచక్రమున' విరసపుర రసపురిముల స్త్రీపురుష వ్యాయామ మందిరముల నెపమున స్త్రీజాతియొక్క గుణలక్షణముల వెల్లడించి వారి మనోభావమున నెరుంగగలిగిన కవితల్లజాల యూహాపరంపరలకు మానవలోకమంతయు నెంతయు నగవవలసినదే. ఇట్టి యుదారస్వభావుల బట్టియే భరతమాత కిట్టి దుర్భరనీచస్థితి రాగలిగినది. విద్యాభివృద్ధివలన జ్ఞానోదయము గల్గుచున్నది. జ్ఞానమువలన సర్వసమత్వమును, అందువలన ద్వేషము నశించి ఏకీభావమును గల్గును. దేశకాలపరిస్థితుల జూచుచుండియు బాల్యవివాహముల మానలేకుండిరి. తమ బాలికలకు విద్య గరపించలేకుండిరి. మనోవికాశములేని తమ చిన్నికూతులను, విద్యాగంధమెరుగని యేమోటకుంతకో తమ యిచ్చవచ్చినవానికి ధనకాంక్షయే ప్రధానముగాగలిగి, ముడివైచి అట్టి దాంపత్యమువలన గలుగు చెడుగులకు తుదకు పరితపించు తలిదండ్రు లెందరులేరు! నేటి పాశ్చాత్యస్త్రీ లెందరు కత్తిని చేతబట్టి యుద్ధరంగమున కరిగి తా మెంతయు పురుషుల కెందును వెనుదీయలేదని జాటుచు, తమ ధైర్యసాహసముల వెల్లడించుచున్నారో లోకవిదితమే! మన భారతీయస్త్రీలలో గూడ నిట్టి సాహసౌదార్యముల జూపి, రణరంగముల కరిగి తమ భర్తలను, తమ రాజ్యమును, తమ ప్రజలను కాపాడ ప్రయత్నించిన రాణి భవానీదేవివంటివార లెందరుండియుండలేదు. నేడు భరతమాత దాస్యవిముక్తికై జరుగుచున్న స్వేచ్ఛారణరంగమున పురుషులతోపాటు స్త్రీలుగూడ బాల్గొననిచో నామె దాస్యశృంఖలముల విడగొట్టజాలరని తెలిసికొనవలెను.

నా చిన్నసోదరి నుడివినట్లు భారతసోదరీమణులు పెక్కుమంది తమ యాత్రమనిర్బంధనమునకై వగచుచు, స్వేచ్ఛాభిలాషులై విలపించుచుంట సత్యము. వారి రక్షణ స్త్రీలోకముయొక్క విధి.

# భారతమాత పవిత్ర పుత్రుడు జవహరిలాల్

శ్రీమతి
ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు

పండిత జవహరిలాలు నెహ్రూ తిరిగి కాంగ్రెసు మహాసభకు అధ్యక్షుడైనాడు. ఆసేతుశీతాచల పర్యంతమే కాదు అశేషభూమండలంలో సభ్యతగల దేశాలన్నీ యిందుకు అభినందించకుండా యుండలేక పోయినవి. రాజనీతినిబట్టి ఒక్క బ్రిటిషు దేశం మౌనంవహించినా ఇది నిజంగాఅపూర్వము. కాంగ్రెసు పుట్టిన 51 సంవత్సరములలో వరుసగా ఒకేవ్యక్తి కాంగ్రెసుపీఠాన్ని అధిష్ఠించడం ప్రతిభాశీవాలతో, స్వాతంత్ర్య పిపాసతో, దివ్యశక్తితో కాంగ్రెసు యొక్క ఆదర్శం, స్వరూపం, ధర్మం దేశంలో పరివ్యాప్తం జేసిన యుగపురుషుడు గాంధిమహాత్ముడుకూడ, ఈ కాంగ్రెసు గద్దెను రెండుమార్లధిష్ఠించలేదు. ఆ సూచనలుకూడా వెనుక కొంత జరిగాయి గాని అవియింత బలిష్టం, పటిష్టంకాలేదు. ఆ మహాత్ముడే యిప్పుడు వీరజవహరిలాలని పేరు అధ్యక్షుడుగా చెప్పినవారిలో మొదటివాడు. ఇందుకు కారణం? అపూర్వమైయే యుండాలి. జవహరిలాలు అసామాన్యవ్యక్తి: విద్యలో, విమర్శనలో, శౌర్యంలో, సాహసంలో, ప్రతిభలో, త్యాగంలో, సేవలో, ఐశ్వర్యంలో, సమత్వంలో అసాధారణుడు. ఒకవిషయంలో కాదు. అన్నిటిలో ఆ వ్యక్తిత్వమే అసాన్యమైనది.



* * *

మహాత్మునికి, పండితునికి ఆదర్శం, లక్ష్యం ఒక్కటైనా పంథా భిన్నం. మహాత్ముని మహాత్ముడుగా గౌరవించి, శిరసు వంచడంలో జవహరిలాలు మొదటివాడు. ఆయన పంథాను పొరపాట్లని తోచినచోట ఖండించడంలోనూ జవహరిలాలే మొదటివాడు. మోమిచ్చకపు మాటలాయనకు మచ్చునకైనా నచ్చవు. పండితునికి మహాత్ముడంటే కన్నతండ్రియందుకంటె అధికభక్తి. మహాత్మునికో నెహ్రూ అంటే పుత్రాతిశయమైన ప్రేమ. తండ్రియైన మోతీలాలుపండితులు స్వరాజ్యవాది; కుమారుడు జవహరిలాలు గాంధి

శిష్యుడు అపహాస్యవాది. ఆరోజుల్లో స్వతంత్రాభిప్రాయాల్ని ప్రకటించడంలో, ఆచరించడంలో దిట్టరి. తాను విశ్వసించిన పద్ధతికి గురువు కాదు తండ్రి కాదు, దేవుడైనాసరే ధిక్కరించి నిలవబడవలసిందే అన్నమాట. తలపెట్టినపనిలో తలకట్టయినా పొల్లుగా పోకూడని నిశితమైనపంథా! ఆహా! ధన్యులు స్వరూపమణీ మోతీలాలుపండితు లీ పుత్రరత్నమును ప్రభవించి. చరితార్థ ఇట్టిమహనీయుని చెట్టబట్టిన మృతజీవిని స్వర్గీయకమలానెహ్రూ. అదృష్టశాలిని ఈ మహావీరుని కనుంగుబిడ్డ కుమారీ ఇందిర.

* * *

ఆ గర్భశ్రీమంతుడు. ఆంధ్రదేశంలోని రాజుల మహారాజుల అందరిఐశ్వర్యాన్ని పోగువేస్తే అంతకు మించిన సంపదగల కోటీశ్వరుడు. డిగ్రీలుచూస్తే కొన్నిమితమైనవేమైనా విద్యలో నిధిఅని చెప్పదగినవాడు. ఉద్యోగంచేస్తే ఎప్పుడో వచ్చేవి గవర్నరుగిరీలు కాళ్లముందుకి. కాని – ఆ వీరహృదయంలో ఉప్పొంగేదేమిటి? స్వాతంత్ర్యపిపాసారక్తం! ఆ కళ్లల్లో ప్రజ్వలించేదేమిటి? సంపూర్ణస్వరాజ్యతృదాగ్ని. నిలువల్లా కదలించేదేమిటి? కొన్నికోట్ల అన్నార్తుల క్షుభితహృదయాలు. కూలీలకు, రైతుల కఠోరజీవితాలు, బానిస ప్రజల నిస్తేజపుబ్రతుకులు. బానిసదేశంలో ప్రభువవడంకంటె స్వతంత్రదేశంలో సేవకుడవడం మేలు. ఆ స్వతంత్రానికి ఆక్రోశిస్తోంది ఆవీరుని ప్రత్యణువు. ఎటువంటి స్వతంత్రం? రాజు, నౌకరు; గొప్పవాడు, కొద్దివాడు; ధనవంతుడూ, నిరుపేద భేదం సమసిపోయిన స్వతంత్రం. కులతత్వాలు, మతభేదాలు, అధికారహంకారాలు నిర్మూలమైన స్వతంత్రం ధీనులు, అధీనులు ఉండకూడని స్వతంత్రం సర్వసమత్వాన్ని ప్రత్యక్షపరచే స్వతంత్రం.

* * *

గాంధిగారికి జవహరిలాలుకి సంపూర్ణస్వరాజ్యమే పరమాశయం. సంపూర్ణస్వరాజ్యం. 16 అణాల స్వరాజ్యం పూర్తిగావుండాలి. ఈవాడు సాధించినా సరే: లేకసాధింపబడినాసరే: కాని అందులో ఒక్కఅణా కాదు; పైసాగూడ తగ్గరాదు. అయితే కొంచెండారివేరు. మహాత్మునికీ స్వరాజ్యంరావాలి వచ్చితీరాలి. కాని అది ధర్మమార్గంలో, న్యాయపద్ధతిలో అహింసాతత్త్వంలో రావాలి. జవహరిలాలుకో! అదీఅంతే! కాని స్వరాజ్యంరాకపోవడం, స్వతంత్రంలేకపోవడం అధర్మం తినేతిండికి, చెప్పే మాటకు, చేసేపనికి హక్కులేకపోవడం అన్యాయం. 35 కోట్లభారతీయులు దాస్యశృంఖలాల్లో, జీర్ణచేలాల్లో అరపూటతిండిలో కృంగికృశించిపోవడం హింస. ఈ అధర్మం, ఈ అన్యాయం, ఈ హింస నివారణకావాలి; ఈదౌర్భాగ్యంపోవాలి; అదీధర్మం అదీన్యాయం. అదీఅహింస. అయితే హిట్లరు ముసోలీనీల తత్త్వాల్లో సంపాదించినా సరేననికాదు. బ్రిటిషు వారినుండి భారతీయులు, ధనికులనుండి బీదలు, నిరంకుశులనుండి బానిసలు విముక్తికావాలి. భారతీయులకు స్వరాజ్యంవచ్చినా ఈ ధనికతత్త్వం, జమీందారీ తత్త్వం, నిరంకుశత్వం నిర్మూలంకాకపోతే ఆ స్వరాజ్యం జవహరిలాలు కక్కరలేదు. అదిస్వరాజ్యం కాదు. స్వతంత్రం అందరి జన్మహక్కు. ఆ జన్మహక్కు పరాధీనంకావడం స్వజాతీయుల చేతిలో కాని, విజాతీయులచేతిలో కాని సహించరానిది. జవహరిలాలుని దృష్టిలో ఆ స్వరాజ్యంలో నెలకు 500/ ఎక్కువ 30/ తక్కువ ఆదాయంవుండే నౌకరుగాని, ఉద్యోగిగాని, భూస్వామిగాని, పేదరైతుగాని వుండకూడదు. గవర్నరయినాసరే ల్యాండులార్డయినా సరే. అదే కరాచీతీర్మానం–కొంచెమించుమించు ఇదే పద్ధతిమీదవచ్చిందికాదూ సోవియట్ రష్యాలోని సోషలిజం (సామ్యవాదం). ధనస్వాములు ఆ ధనానికి ధర్మకర్తలుగానే వుండాలి. అది బీదలకు

పంచిపెట్టడానికి ప్రజాశ్రేయస్సైన కార్యాలకు విని యోగించడానికి ధర్మకర్తృత్వం వహించాలిగాని కేవలం స్వార్థానికి కర్తృత్వం పనికిరాదంటాడు మహాత్ముడు. ఈ ధర్మకర్తృత్వం, ఈ గుళ్లో పూజారిత్వం ఎందుకు? పేదలు వుండకూడదంటాడు జవహర్‌లాల్. ఆధ్యాత్మికహక్కు అందరికీ సమానం కాదా అంటాడు మహాత్మాజీ. ఆర్థికహక్కు అందరికీ సమానంగా ముందురావలంటాడు జవహర్‌జీ. ముక్తి మార్గంలో భుక్తి కుదురుతుందంటాడు మహాత్ముడు. భుక్తిలేనిదే ముక్తిలేదంటాడు పండితుడు. నావిష్ణుః పృథివీపతిత్వం ఉభయులకు పనికిరాదు. అసలు ఆ విష్ణుఃపృథివీపతులు ఏకృత, త్రేతాల్లోవారో: అప్పుడుమాత్రం? శ్రీరామచంద్రుడు సీతాదేవి నెందుకు అడవికిపంపాలి? సీతాదేవి లోకపూజ్య, పతిప్రాణ. రాముడో! ఏకపత్నీప్రియుడు. ప్రేమ మయుడు. కాని ప్రజాభిప్రాయానికి. ఆ ప్రభుత్వం ప్రజాస్వామ్యం కాదా? ప్రజాభిప్రాయం సబబా? కాదా? అనికాదు యిప్పుడుప్రశ్న! దుర్యోధనాదులు వంశానుగతంగా, అగ్రజునిసంతతి, రాజ్యాధికారులు. పాండవులకెందుకు పట్టంగట్టి కౌరవులను గద్దదింపాలన్నారు ప్రజలు? దేవతలు ఋషులుకూడా దీవించారే పాండవుల్ని? సకలకళాపూర్ణుడైన వేనునిసంహరించి పృథువును పీఠమెక్కించారు ప్రజలు. ఎందుకు? వేనుడు ప్రజాపీడితుడని కాదూ! ప్రజాక్షేమానికి కానిది ధర్మవిరుద్ధమనే శాసనం. కళింగ యుద్ధంలో నాశనమైన లక్షప్రజలెత్తు, ఏకపుత్రుని గోల్పోయిన వృద్ధమాతరొక్కరెత్తుగా అస్త్రసన్యాసం గావించాడు అశోకచక్రవర్తి సార్థకనాముడై. అహంకారధికారోన్మత్తతలలోనై, తనరాజ్యాభివృద్ధి పేరు చెప్పి, ఇంతమంది ప్రజలు శవాలని రక్తసముద్రంలో తేలించడానికి తనకేమి హక్కువుందని. నిజంగా అవి ప్రజాస్వామి కాలు. ధర్మరాజ్యాలు. వారు నావిష్ణుఃపృథివీపతులు. విష్ణ్వంశాసంభూతులు. పృథివీపతిగావుండాలి. అతనిలో ఆ సమదర్శిత్వం వుంటుందని కాని పృథివీపతిలో విష్ణువంశ వుంటుందని కాదు. ఇప్పడా యుగాలు లేవు. అవి కాలగర్భంలో లీనమైపోయినాయి. ఇది కలియుగం కాదు. బ్రిటిషు యుగం కాదు. నిరంకుశయుగం కాదు. బూర్జువా యుగం కాదు. అన్నీకలిసిన సంకరయుగం. అది మనకు సంబంధంలేకుండా దూరంగాపోవాలి. అందుకు ఇప్పుడు కావలసింది ప్రజాస్వతంత్రం. ప్రజాస్వామ్యం. ప్రజాప్రభుత్వం. ఇదీ జవహరిలాలుని సామ్యవాదం. సామ్యవాదం అంటే ఆశబ్దంలో సర్వసమత్వం అని చక్కని అర్థమున్నా, అంతకంటె సోషలిజం అనే పేరులో వాక్కునకందని ఉపమాతీతమైన అర్థమున్నా, ఆపేరు వింటే హడలు ప్రభుత్వానికి. అంతకంటె అది రష్యాలోంచి వచ్చింది గనుక దివ్యమైన భారతదేశంలో ఇంకో అనుకరణ మేమిటంటారు మన మహనీయులుకూడా కొందరు. ఆచరణీయము, అనుకరణీయము అయినప్పుడు ఏ దేశంలోపుడితే ఏమిటి? విషయప్రాముఖ్యమా మనకు కావలసింది? మీ, మా భేదమా? గాంధిమహాత్ముని అహింసాసిద్ధాంతము పాశ్చాత్యదేశాల్లోకూడా కొన్ని చోట్ల అమలుజరుపాలని తీర్మానించారు కాదూ? పతితదేశాల్లో స్వతంత్ర్యం స్థాపించుకోవడానికి ఏదో ఒక ఉత్కృష్టమార్గం వెలువడుతుంది. అది ఆయాదేశ, కాల, పాత్రౌచిత్యంగా కావలసిన పరిణామాలతోనే స్థిరపడుతుంది. అయితే రష్యాకీ, ఇండియాకీ కొంతభేదముంది. ఎంత ధనికులచేతుల్లో, అధికారులచేతుల్లో హాతమారిపోయినా, రష్యా రష్యా క్రిందనే బాధపడింది. కాని ఇండియా? 6 వేలమైళ్ల దూరంలో రంగుకూడకలవని బ్రిటిషువారిక్రింద. అందుకోసం ఆ ప్రజాస్వామికాని కంటె ఈ ప్రజాస్వామికానికి అత్యంతంగా అష్టకష్టాలుపడాలి. ఆత్మార్పణం కావాలి. ఆ జన్మహక్కయిన స్వతంత్రం సాధించాలి. యశోవా! మృత్యుర్వా!!

గాంధిగారి చర్ఖా, ఉప్పుయుద్ధాల్లాగే జవహరిలాలు సోషలిజం అన్నాకూడా వెర్రిగా కనిపించింది ప్రారంభంలో పెద్దలికి. రవిఅస్తమించని బ్రిటిషు సామ్రాజ్యానికి, మారణయంత్రాలు, విషవాయువులతో దేశాన్నే కాదు, భూతలాన్నికూడా నిర్మూలం చేయగల ప్రతిభావంతమైన బ్రహ్మాండమైన బ్రిటిషు వారితో యుద్ధానికి, ఎనిమిది చెక్కముక్కలు అడ్డదిడ్డంగా పెట్టి అతికిన ఈ రాట్నమా! జేనెడు ఇనుప కదురా? ఉప్పునఊదితే ఎగిరిపోయే మూరెడుదారం ముక్కా? ఈ మూడా ముప్పదిఅయిదుకోట్ల భారతీయులను ముష్ఠిలో బిగపట్టిన బ్రిటిషుమహాసామ్రాజ్యంతో ఢీకొనడానికి మహాయుద్ధసాధనాలు? అని నవ్వినారుకదూ మొట్టమొదట? కాని! కీలెరిగినవాతన్నట్లు ఆదెబ్బ బ్రిటిషుకి ప్రాణాలైన మాంచెష్టరు లంగాషైరులకు కొట్టింది. ఆరాట్నమే సుదర్శన చక్రమైనది. ఆ కదురే త్రిశూలమైంది. ఆదారమే ఉరిత్రాడైనది. ఆరవి అస్తమించని బ్రహ్మాండ మహా బ్రిటిషుకి, రెండవమారు ఉప్పుసత్యాగ్రహమో అంతే! ఈ మహాబ్రిటిషుసామ్రాజ్యంతో ఎదురొక్కనేది, నీళ్లల్లో వేస్తే కరిగిపోయేది నిప్పుల్లో వేస్తే పేలిపోయేది ఈ చిన్న ఉప్పుకళ్లా? అన్నారు హేళనగా? కాని అదే ఏమయింది? బ్రిటిషుసామ్రాట్ గుండెల్లో ఫిరంగి గుండయింది. ఆ రవిఅస్తమించని బ్రహ్మాండమైన సామ్రాజ్యం, ఈకొల్లాయి గాంధికి జో......... అంది. ఆఫలితమే కదూ? గాంధి యిర్విను సంధి?

* * * *

అయితే స్వరాజ్యం ఏకొద్దిమందో త్యాగంచేసి ఆహుతియైపోయి, లేక ఏమహాత్ముడో తపస్సుచేసి ధారపోసేది కాదు. అది అందరిహక్కు. అందరి సొత్తు. అందరిసొత్తుకు అందరుపోరాడాలి. లేక ఏ గొప్పవాళ్లనుకునే కొంతమందివల్లనో సాధింపబడితే ఆ అధికారంవచ్చేసరికి ఆ అహంకారం మిన్నంటి పోదూ? (అసలు అధికారానికి అహంకారానికి అవినాభావసంబంధం గాబోలు! వస్తువుతో నీడలా, ఉరుముతో మెరుపులా.)

* * * *

నిజంగా ఒక విషమసంధిలో జవహరిలాలు నాయకత్వం వచ్చింది. దేశం నేడు సామాన్యమైన ప్రమాద స్థితిలోలేదు. ఇటువంటి విషాదపరిస్థితుల్లో దేశాన్ని సూటియైనదారిలో నడిపించడానికి ఎటువంటి నాయకుడు కావాలి? అన్నివిధాల ఆదర్శవ్యక్తి కావాలి. అవిశిష్ఠత, అనుగుణమైన ఆసమర్థత ఒక్క జవహరిలాలులోనే వుంది యిప్పుడు. అందుకే ఈస్థితిలో అధమం 3 ఏండ్లయినా ఈఅధ్యక్షుని చేతిలో వుండాలి అన్నాడు గాంధి. ఇటువంటివాట్లల్లో నిధిగా మొత్తానికి 35 కోట్ల భారతీయులలో జోహుకుందార్లు మినహా యావన్మందీ జవహరులాలుని అధ్యక్షుడిగా ఆహ్వానించారు అభినందించారు. ఆసేతుహిమాచలం హర్షపులకితమై కుసుమవర్షం కురిపించింది. అయితే జవహరిలాలుని అధ్యక్షుడుగా ఆహ్వానించడమేనా మనపని? జవహరిలాలుని నాయకత్వం, కార్యక్రమం 390 రోజులనుండి మనం చూస్తున్నాం. రోజుకి 390 గంటలున్నా ఆయన అలుపు, విశ్రాంతివుండదు. అది ఏల? అదిగో! ఆయన హృదయం ఎట్లా ఈ దాస్యనిర్మూలనానికి ఆక్రోశిస్తుందో! ఆరక్తం ఎట్లా స్వతంత్రావేదనంలో ఉడుకుతోందో! ఆపిపాస కావాలి మనకు! ఆఆకలి మండాలి మనలో. ఆ త్యాగాగ్నితో ప్రజ్వలించాలి మనం. ఆ కార్యదీక్షకు, కార్యసాధనకు అనుచరులం కావాలి. ఎటువంటి అనుచరులం? మాటకి కాదు. చూడండి కళ్లు విప్పి ఒక్కసారి దేశంవంక. చెప్పండి సింహావలోకనం.

* * * *

జవహరు జైలులోనుండగా తెలిసింది ప్రాణప్రియ, పతి ననుసరించిన సతి, కమలానెహ్రూ జీవితం, జైలు

వాసం ఫలితంగా అపాయస్థితిలో విదేశాల్లోనుందని. మళ్ళీవచ్చి పూర్తిశిక్ష అనుభవించే షరతుతో విడుదల చేస్తామన్నారు గవర్నమెంటు. 'ససేమిరా! షరతులు, గిరతులు నైజాంతా' అన్నాడు. ఆహా! ఎటువంటి ధీరోదాత్తుడు? ఎటువంటి ఆత్మ స్వాతంత్ర్యం? ఎటువంటి వీరహృదయం? అదే నేడు నాయకుని కుండవలసిన లక్షణం. షరతు లేంలేవు. విడుదలచేశాం అన్నది ప్రభుత్వం. ప్రేమైక జీవన, ప్రియపత్ని దనతోపాటు దేశమాత నారాధించిన అర్ధాంగి, రోజులు, గంటలు లెక్కలో మృత్యుశయ్యమీదనుండగా, క్షణికంలో సన్నిధిని వ్రాలవలెననే ఉద్విగ్నహృదయుఁ, సముద్రంలా లోలోపల మరగి నురగలౌతున్నా పైకి గంభీరంగా, ప్రశాంతదరస్మితవదనంతో మిత్రుల వీడ్కోలుల్లో విమానం ఎక్కినాడు. వియన్నాకి కమలానెహ్రూలా వంటి భార్యకి, జవహరలాలువంటి భర్త ఏవిధంగా సేవచెయ్యాలో అట్లాచేశాడు. కాని ఈశ్వరాజ్ఞ అన్యథాఅయింది. భర్తను పుత్రికను దేశాన్ని విషాదంలో ముంచి కర్తవ్యపరాయణతకి మార్గదర్శినిగా నిర్యాణం పొందింది కమలానెహ్రూ! దేవతల పిలుపుతో మృత్యువు తీసుకొని వెళ్లింది కమలా నెహ్రూను. కాంగ్రెసు మహాసభాధ్యక్షతకు భారత దేశం ఆహ్వానించింది జవహరులాలు నెహ్రూను. శిరసావహించాడు. కాంగ్రెసుగద్దె ఎక్కాడు గత సంవత్సరం. ఆహా ఎటువంటి ధీరోదాత్తత! ఎటువంటి కర్తవ్యపాలనం? ఎటువంటి గంభీరహృదయం! అటువంటి నాయకుడు కావాలి నేడు మనకి.

—ప్రజాబంధు.

# భారతనారి — పాశ్చాత్యనారి

స్వామివివేకానంద

నా జీవితమందలి ఏకమాత్ర వాంఛ — ఒకానొక చక్రమును బరివర్తనమొనర్చుట: అది ప్రతివ్యక్తికడకు ఉన్నతాతిఉన్నతము లగు తత్త్వరాసులను గొనిపోవును. తరువాత ప్రతినరుడును, నారియును తమతమ అదృష్టములను తామే నిర్మించుకొనెదరు. మన పూర్వపురుషులును, ఇతరజాతుల వారును జీవితమునందలి గురుతరసమస్యలను గుఱించి ఎట్లు చింతించినది వారే భావింతురుగాక! ముఖ్యముగా, ఇతరులిప్పుడేమి ఒనర్చుచున్నారో, వారు గాంచెదరుగాక!; పిమ్మట, ఏమొనర్పవలసియున్నది వారే స్థిరపరుచుకొనెదరుగాక.

మనము, పాశ్చాత్యులసమాజరీతి నీతులను అత్యంతధైర్యముతో పర్యవేక్షింపవలెను. ఈ విషయమై హఠాత్తుగ ఒక సిద్ధాంతము నొనర్చుట పాడికాదు. స్త్రీ పురుషుల మెలయిక, ఇతర ఆచారవ్యవహారములు, మున్నగువానికన్నింటికిని అర్థమున్నది. అన్నింటికిని 'మంచిపెడ'యున్నది. కాని కేవలము ఈవిషయములను ధైర్యముతో నాలోచింపవలసియున్నది. మనము వారిఆచారవ్యవహారములను అనుకరింపవలయును, వారుమన ఆచారవ్యవహారములను అనుకరింతురనికాదు. మఱినాఅభిప్రాయమే మనఅన్ని దేశములవారి ఆచారవ్యవహారములును, వందలకొలది శతాబ్దములనుండి మెల్లమెల్లగ పరిణామమునొందిన క్రమవికాసముయొక్క ఫలములు, వీటికన్నింటికిని గంభీరమైన అర్థమున్నది. కనుక, మనము వారి ఆచార వ్యవహారములను వెక్కిరింపకుందుముగాక, వారును మనలను ఈసడింపకుందురుగాక!

ఒకానొక సంస్కృతకవి వ్రాసినాడు: 'నగృహం గృహమిత్యాహుర్గృహిణీ గృహముచ్యతే'— ఇదెంతనిజము! నిన్ను శీతాతపములబారినుండి రక్షించు ఇంటికప్పు గుణదోషములను విచారింపవలసియున్నచో అది నిలబడియున్న స్తంభములను జూచి విచారించుట తగదు — ఆ స్తంభములు అత్యంతమనోహరములగు శిల్పకార్యములతోనొప్పు 'కొరింథియన్ స్తంభము'లే యగుగాక! ఆ గృహ కేంద్రస్థానమగు చైతన్యమయ స్తంభముగాంచి, విచారింపవలెను. ఈ స్తంభమే గృహస్థుల కసలైన అవలంబనము — నేను నారినిగుఱించి చెప్పుచున్నాను. ఈ ఆదర్శము ననుసరించి విచారించిన అమెరికాయందలి సంసారజీవనము పృథివియందలి మఱి ఏ ఇతరకుటుంబజీవనమునకును దీసికట్టదు.

నేను అమెరికాయందలి సంసారజీవనమునుగుఱించి చాల పొల్లుమాటలను విని యున్నాను — అట ఆడువారు ఆడువారియట్లు సంచరింపరట, స్వాతంత్ర్యతాండవమున ఉన్మత్తలై సంసారసౌఖ్యమును మంట కలుపుచున్నారట, ఇంకను ఇట్టివేయగు పలు పల్కులు. కాని, ఇప్పుడొక సంవత్సరకాల మటగడపి, వారివిషయమున ప్రత్యక్షాను

భవమును సంపాదించి చూచునుకదా, ఈ పొల్లుమాటల కేమియు ఆధారములేదు, భ్రాంతియుతములు.

గత గ్రీష్మసమయమున నేను దూరదేశమునుండి, ఊరుపేరులు, విద్యాధనములు, సహాయసంపదలు లేకుండ పరివ్రాజకరూపమున ఆదేశమున కటిగితిని. అప్పుడు నాకు సహాయమొనర్చినది వారే; వారు నా కాశ్రయమొసంగిరి, వారి గృహములకు దోడ్కొనిపోయిరి, పుత్రునివలె మిత్రునివలె గౌరవించిరి, వారి మతాచార్యులు ఈ 'విపజ్జనక విధర్మి'ని త్యజింపబోధించుచున్నను, వారిమిత్రులు అజ్ఞాతకులశీలుడగు ఈ విదేశీయుని విడిచిపెట్ట ఉపదేశించుచున్నను, వారు నాసఖ్యమును విడువలేదు. మహామనస్కులును, స్వార్థరహితులును, పవిత్రలునునగు ఈ రమణులే శీలమును గుఱించియు విచారింపసమర్థలు. కారణము, నిర్మలదర్పణముననే ప్రతిబింబముపడును.

సుందరజీవనము నవలంబించియున్న కుటుంబములు వందలకొలదిగ నాకండ్లబడినవి; నిర్మలచరిత్రలగు జనుల ననేకుల గాంచితిని; స్వార్థశూన్యమగు వారి అపత్యస్నేహమును వర్ణింపభాషచాలదు. 'జయినాదేవి లలాటస్థతుషారకణము'వలె నిర్మలలగు కుమారిక లనేకులగాంచితిని; వారు విశిష్టమగు విద్యను నేర్చియున్నారు. సర్వవిధములగు మానసిక, ఆధ్యాత్మికఉన్నతిని వారు కనినారు. మంచిచెడ్డ లెల్లతావుల నున్నవి. మనము చెడ్డవారని నిరూపించు వారిని గైకొని, ఒకజాతిని పరీక్షింపచనదు; ఇట్టివారెల్లప్పుడును వెనకబడియేయుందురు. ఎయ్యది మంచిదియో, పవిత్రమో, అద్దానివలననే జాతియొక్కయు, జీవనముయొక్కయు, నైర్మల్యము, తేజస్సు, ప్రవాహము నిరూపింపబడును. ఒక యాపిల్ చెట్టును, దానిపండ్లనుగుఱించి నిర్ణయింపవలసినపట్ల, ఆ చెట్టుక్రింద క్రుళ్లిడొల్లిన కాయలను, పురుగులుకొట్టినపండ్లను – అవి మెండుగనే యుండిన ఉండుగాక. గైకొందుమా? ఏపుగానెదిగిన మంచిపండు ఒక్కటియున్నను, దానినేగైకొని, ఆ చెట్టుశక్తిని, ఈవిన్ని, ఉద్దేశ్యమును నిర్ణయింతుము. ఎదగని కసుగాయలనుగాంచి విచారింపము.

నేను అమెరికాయందలి ఆధునికరమణుల ఉదారహృదయమును ప్రశంసింతును; ఉదారులగు పురుషులను గూడ అనేకుల గాంచితిని (వీరిలో కొందఱు అత్యంతము సనాతనులు) కాని పురుషులు ఉదార (Broad) మనస్కులనబోయి, తమ మతమునే చిదుకగొట్టుదురు_ఈ భయమున్నది. మంచిదానియెడల సానుభూతి గనపర్చుట అచ్చటివారి నైజగుణము; అందువలన యువతులు ఉదారమతులగుదురు గాని, స్వధర్మమునుండి విచలితలుగారు.

ఇంతటి పవిత్రదయతో నొప్పు మరొక కుటుంబము నాకు కనంబడలేదు. లేనిచో ఇంతగ వీరియందీశ్వరకృప ఎట్లు ప్రవహింపగలదు! ఏమిదయ! ఒకబీద ఒకానొకచోట కష్టపడుచున్నాడు అని వినినతోడనే

అన్నవస్త్రముల నొసంగ ఉద్యోగమును కుదర్చ వీరటకు పరిగిడుదురు.

ఒకడు నాకు వ్యతిరేకియైన సహాయ్యము చేయువారు పందలుకొలది. అట మనిషి మనిషికొఱకు చింతించును. నిజసోదరుల నిమిత్తము రోదించును. అటనున్న రమణులు దేవీ స్వరూపిణులు. అమెరికన్ స్త్రీలను గురించి నే జెప్పునది. వారు నాకత్యంతము స్నేహితురాండ్రు; ఒక్క 'చికాగో'లో నే కాదు అమెరికాయందంతటను వారు నాకు జూపిన దయకు కృతజ్ఞతను బ్రకటించుట నాకసాధ్యము. ప్రభువు వారి నాశీర్వదించునుగాక!

ప్రతి అమెరికన్ నారియు లక్ష హిందూలలనలకంటె అధికవిద్యావతి. మన దేశమునందలి మహిళాగణము వారివట్లు విద్యనేర్వదేమి? తప్పక వారికట్టి విద్యను నేర్పవలెను.

ఆదేశపుస్త్రీలనుగాంచి నామతి స్తబ్దము! నన్ను చంటిపిల్లవానివలె వెంటబెట్టుకొని మైదానములకు, దుకాణములకు, బజారుకు దీసికొనిపోవుదురు. వారన్ని కార్యములను నిర్వర్తించగలరు. వారొనర్చుదానిలో నూరవవంతుగూడనే నొనర్పజాలను. వీరు రూపమున లక్ష్ములు గుణమున సరస్వతులు వీరు సాక్షాత్తు జగదంబలు. ఇట్టి యువతులను ఒక్క వెయ్యిమందిని తయారుచేయ గలిగిన నిశ్చింతుడనై మరణింతును. ఈ దేశపు జనులు మనుష్యులా! ఈ పురుషులు ఆదేశపు స్త్రీల సరసను గూర్చుండుటకే తగరు. ఇక స్త్రీలసంగతి ఏమి?

వీరిలో నేను ఈ ఆశ్చర్యకరమగు యువతిని గాంచుచున్నాను. జగదంబకృప! పురుషుల చెవులను నులుమబోవుచున్నది; వీరు మునుకలు వేయుచున్నారు. అమ్మా! నీ కృపయే. స్త్రీపుంభేదపు తమస్సును విరుగగొట్టి మరీ వదిలెదవా? స్త్రీపురుష భేదభావమును దూరమొనర్చుము. అంతయు ఆత్మయే శరీరాభిమానమును విడిచిపెట్టుము. 'అస్తి, 'అస్తి'అని వచింపుము; 'నాస్తి, నాస్తి'అని దేశమధోగతయైనది. 'సోహం, సోహం, శివోహం, శివోహం.' ఇదేమి! ప్రతి ఆత్మయందు అనంతమగు శక్తియున్నది. లేదు లేదని కుక్క పిల్లి అయిపోయెదరా ఏమి? ఎందులేదు, ఎవరికిలేదు? 'శివోహం, శివోహం'. 'నాస్తి నాస్తి'అనిన నాకు వజ్రపాత మట్లుండును. ఈ దీనహీనభావమే ఒక రోగము. ఇదేమి దైన్యమాలేక గుప్తముగనున్న అహంకారమా? 'నలింగం ధర్మకారణం సమతా సర్వభూతేషు ఏతన్ముక్తస్య లక్షణమ్.' 'అస్తి అస్తి, సోహం సోహం, చిదానందరూపః శివోహం శివోహం.' 'నిర్గచ్ఛతి జగజ్జాలాత్ పింజరాదివ కేసరీ.' 'నాయమాత్మాబలహీనేన లభ్యః' తుషారప్రవాహము (Avalanche) వలె ప్రపంచముపై పడుము—జగత్తు పటపటబ్రద్దలైపోవుగాక. హరహర మహాదేవ ఉద్ధరేదాత్మనాత్మానమ్.

—సశేషము.

# అంధకారంలో ప్రకాశం

శరత్చంద్రచటర్జీ

(గతసంచిక తరువాయి)

౫

ఉదయం గంగాస్నానంచేసి మెల్ల మెల్లగా యింటికి తిరిగివచ్చాడు సత్యేంద్రుడు. అలసత్వంతోను, అశ్రువులతోను కూడివుంది అతనిదృష్టి. కనురెప్పలు యింకా తడిగానేవున్నై. నాలుగుదినాలనుండీ అతనికి ఆ అపరిచితప్రియురాలు కనుపించడమే లేదు. కారణం ఆమె గంగాస్నానానికి రాకపోవడమే.

కొన్నిదినాలనుండీ సత్యేంద్రుడు రకరకాలైన అంతులేనివిషయాలు ఆలోచించుకునివున్నాడు. కాని మధ్యమధ్యలో 'ఆమె మరణించిఅయినా వుంటుంది, లేక మరణశయ్యమీదఅయినా పడివుంటుంది' అనే దుశ్చింతకూడ అతని మనస్సులో వుత్పన్నమౌతూ వుండేది.

అతనికి ఆమెవుండేగల్లీతప్ప ఎవరియిల్లుఅయిందీ, ఆమె ఎక్కడవున్నది తెలియనేతెలియదు. 'ఆరోజున నేను ఆమెతోగూడవెళ్లి యింటినియెందుకు చూడక పోతిని? ఆమెయెంత బ్రతిమిలాడినా యెందుకు వొప్పుకోపోతిని?' అనేసంగతి జ్ఞాపకంవచ్చినప్పుడు పశ్చాత్తాపంతో, అతనిహృదయం దగ్ధమైపోతూ వుండేది.

అతను మనసారా ప్రేమించాడు ఆమెను. అది కేవలం నేత్రాల మాదకత్వంగాదు. అంతులేని హృత్పిపాస. దానిలో కపటానికి స్థానంలేనేలేదు. అదంతా నిజమైన పవిత్రహార్దిక స్నేహం.

"బాబుగారూ!"

సత్యేంద్రుడు వులిక్కిపడిచూచాడు. ఆమెవెంట యెప్పుడువస్తూవుండే పనిమనిషి రాస్తాకువొకవైపున నిలబడివుంది.

సత్యేంద్రుడు కొంచెంగాబరాతో ఆ పనిమనిషి వద్దకువెళ్లి అడిగాడు—ఆమెకు యేమి సంభవించింది? అంటూనే యేడవసాగినాడు. తనవశంలో తానులేడు. పనిమనిషి శిరస్సువంచుకుని వచ్చేనవ్వును ఆపుకుంటూ వుంది. బహుశ సత్యేంద్రునిముందు పెద్దనవ్వువస్తుందనేభయంతోకాబోలు శిరస్సువంచుకునే జవాబిచ్చింది—ఆమెచాల అనారోగ్యంగావుంది. మిమ్మలను చూడాలనేవుద్దేశ్యంతో నన్ను మీవద్దకు పంపించింది.

"పదపద."

అని కన్నీళ్లుతుడుచుకుంటూ దాసీవెనుక బయలుదేరాడు. కొంచెందూరం వెళ్లినతర్వాత దాన్ని అడిగాడు—జబ్బేమిటి? చాలాయెక్కువగావుందా? దాసీఅంది-జబ్బేమిలేదుకాని జ్వరంబాగావస్తూవుంది.

సత్యేంద్రుడు భగవంతుణ్ణి ప్రార్థించాడు. దాసీని యింకేవిషయం అడగలేదు. దాసీదానితోకూడ వొక పెద్దభవనంవద్దకు వచ్చిచేరాడు. ఆ భవనంవాకిటి ముందు వొకద్వారపాలకుడు కూర్చుని కునికిపాట్లు పడుతూవుండడం చూచాడు సత్యేంద్రుడు. ఆయన దాసీదాన్ని అడిగాడు—నేనువస్తే ఆమెతండ్రికి కోపంవస్తుందేమో? ఆయన నన్నెరగడు.

దాసీదిఅంది—ఆమెకు తండ్రిలేదు, పినతల్లివుంది. ఆమె ప్రేమించినట్లుగానే ఆమెతల్లికూడా మిమ్ముల్ని ప్రేమిస్తూవుంది.

సత్యేంద్రుడు మారుమాటాడక ఆభవనంలోనికి వెళ్లాడు.

మెట్లుదాటి మూడో అంతస్థువరండాలోనికి చేరి బాగా అలంకరింపబడిన ముందుగదులను చూచాడు. చివరగదిలోనుండి నవ్వుతోపాటు తబలాధ్వని, గజ్జెల మోత వినిపిస్తూవుంది. దాసీది ఆవైపుకు చేతిలో చూపిస్తూఅంది—ఈగదే, లోపలికిపదండి.

అంటూ యింకాకొంచెం ముందుకువెళ్లి దర్వాజా పర్దానుతొలిగిస్తూ పెద్దగాఅరిచింది-యిదిగో వచ్చారు!

ఆగదిలోనిదృశ్యం చూడగానే సత్యేంద్రుని తల తిరగనారంభించింది. స్పృహతప్పిపడిపోతానని అను కున్నాడు. ఏదోకవిధంగా మండిగంపహాయంతో కండ్లుమూసుకుని దర్వాజావద్ద కూలబడినాడు.

ఆగదిలో ఒకబల్లమీద లావాంటిపరుపు పరిచి వుంది. దానిమీద యిద్దరుముగ్గురు పెద్దమనుష్యులు కూర్చునివున్నారు. ఒకహార్మోనియం, వొకతబలా వున్నై. ఒకమనిషి సారాయిబాగా త్రాగుతూ వున్నాడు.

ఆసుందరి యింతకుముందే ఆట ప్రారంభించింది. ఆమెపాదాలకు గజ్జెలుకట్టబడివున్నై. శరీరమంతా అనేకవిధాలైన భూషణాలతోనిండివుంది. సురా పానపుమత్తుచే నేత్రాలువూగుతూవున్నై. ఆమె త్వరగా సత్యేంద్రునివద్దనువచ్చి చేతినిపట్టుకుని కిల కిలనవ్వుతూఅంది—ఓస్నేహితుడా! నీకు మూర్ఛల రోగంవుందాయేం? పరిహాసంకట్టిపెట్టు,లే—నాకు యీయన్నిచూస్తే చాలాభయంగావుంది.

ఆయువతి కరస్పర్శవల్ల ఆపాదమస్తకం కంపించి పోయాడు సత్యేంద్రుడు.

రమణిఅంది—నాపేరు శ్రీమతి బిజలీ. నీవేనో స్నేహితుడా? మొద్దబ్బాయా?

అక్కడివారంతా బాగానవ్వారు. అదాసీది నవ్వు ఆపుకోలేక భూమిమీదపడిపోయి అంది—వాహ్, మీకు వలలోవేసుకునే వుపాయం బాగాతెలుసు.

బిజలీ కోపంవచ్చినట్లునటిస్తూ అంది — నోరు మూసుకో. నోటికివచ్చినట్లువాగకు. ఆ తర్వాత సత్యేంద్రునితో అన్నది—రండి, యిక్కడికివచ్చి కూర్చోండి. అనిఅంటూ బిజలీ సత్యేంద్రునిచేయి బట్టుకునిలాక్కొచ్చి వొకకుర్చీలో కూర్చోబెట్టింది. తాను ఆయనపాదాలవద్ద మోకాళ్లమీదకూర్చుని చేతులుజోడించి పాడనారంభించింది. ఆత్రాగుబోతు లేచి సత్యేంద్రుని పాదాలవద్దకువచ్చి సాష్టాంగ ప్రణామంచేశాడు. మత్తులో నిమగ్నుడైవున్నాడు అతను. యేడుస్తూఅన్నాడు—అయ్యా, నేను మహా పాతకిని—నాకు మీరు మీపాదధూళికొంచెం—

ఈదినం అదృష్టవశాత్తు సత్యేంద్రుడు స్నానం చేసినతర్వాత వొకపట్టువస్త్రంకట్టుకొన్నాడు.

హార్మోనియంవాయించేమనిషి యింతవరకు తెలివి లోనేవున్నాడు. అతను కొంచెంసానుభూతి చూపిస్తూ అన్నాడు—పాపం, యెందుకు బూటకపుతమాషా చూపించుతావు ఆయనికి.

బిజలీ నవ్వుతూ అంది—బూటకపు తమాషా? నిజమైన తమాషేయిది. అందుచేతనే ఈదినం మిమ్ముల్ని యిక్కడకురప్పించి తమాషాచూపిస్తున్నా. సరే, నాతోడు, నేనెవర్నిఅనుకున్నావు? నేను నిత్యం గంగాస్నానంచేయడానికి వస్తూవుంటా. అందువల్ల నేను బ్రహ్మసమాజకురాలినిగానీ, మహమ్మదీ మతస్థురాలనుగానీ, క్రిష్టియనుమతస్థురాలనుగానీ కాదనితెలుస్తునేవుంది. ఇంతవయస్సువచ్చిన పెద్ద పిల్లనుచూచినపుడు నీవు సధవగానో విధవగానో తలచివుండవలసింది—యేవిధంగా భావించి నన్ను ప్రేమించసాగావు? నన్ను వివాహమాడతలంచావా లేక మోసపుచ్చి యెక్కడికైనా లేవదీసుకుపోదలం చావా?

# అంధకారంలో ప్రకాశం

అందరూ వొక్కపర్యాయం గల్లంతుగా నవ్వారు. ఆతర్వాత అందరూ యేమేమో అనసాగారు. సత్యేంద్రుడు వంచినశిరస్సును యెత్తకపోగా యెవరిమాటకు యేవిధమైన జవాబుయివ్వలేదు. అతనుమనస్సులో అనుకున్నవిషయం యేవిధంగా చెప్పగలుగుతాడు? చెప్పినా విశ్వసించేవారెవరు? అది అనవసరమైన విషయం.

బిజలీ చకితురాలై నిలబడిఅంది—నేనేంమనిషిని! శ్యామా, త్వరగా వెళ్లు, ఆయనగారికి ఫలహారంతీసుకురా. పాపం స్నానంచేసివచ్చారు. ఇంతవరకు నేను పరిహాసంచేసేదాన్ని చేసినట్లేవున్నా. చెప్తూచెప్తూ వుండగానే యింతకుముందువున్న పరిహాసపు వుత్తప్త స్వరం స్నేహంతోకూడి అకృత్రిమఅనుతాపం బొత్తుగా చల్లబడినది.

కొద్దిసేపటికి పనిమనిషి అనేకవిధములైన ఫలహారపువస్తువులతోనిండిన వొక పళ్లెంతీసుకువచ్చింది. బిజలీ ఆపళ్లెంతీసుకుని సత్యేంద్రుని ముందుకువచ్చి మోకాళ్లమీదకూర్చుని అంది—కొంచెంముఖంయెత్తు. కొద్దిగాఫలహారంతీసుకో.

సత్యేంద్రుడు యీలోపున తనశక్తి సంపాదించుకుని తెప్పరిల్లుతూవున్నాడు. అతను శిరస్సుయెత్తి శాంతిభావంతో అన్నాడు—నేనుతినను.

"ఎందువల్ల? నీవు నీకులానికి కాకుండాపోతావా? నేను అంటుకోదగని మాలమాదిగదాన్ని అనుకున్నావా?"

సత్యేంద్రుడు ఆవిధమైన శాంతస్వరంతోనే చెప్పాడు—నీవు అటువంటిదానివే అయివుంటే నేను తప్పకతినేవాణ్ణి. నీవు యెటువంటిదానివైనదీ నేను వేరేచెప్పనవసరంలేదు.

బిజలీ కిలకిలనవ్వుతూఅంది—మొద్దబ్బాయికికూడ పరిహాసంచేయడం తెలుసునే!

అని అంటూ బిజలీ మళ్లీ నవ్వింది. కాని ఆనవ్వు కేవలం శబ్దమే, నవ్వు కాదు. ఆ కారణంవల్ల ఆ నవ్వుకు తోడుగా యెవరూ నవ్వలేదు.

సత్యేంద్రుడు అన్నాడు—నా పేరు సత్యేంద్ర నాథచౌదరి, మొద్దబ్బాయి కాదు. నేను పరిహాసం చేయడం నేర్చుకోలేదుగాని అపరాధం జరిగిందని తెలుసుకున్నప్పుడు దాన్ని సవరించుకోవడం తప్పకుండా నేర్చుకున్నా.

బిజలీ అకస్మాత్తుగా యేదో అనబోయిందిగాని చివరకు దాన్ని ఆపుకుని అన్నది—నేను అంటుకున్న దాన్ని తినవా?

"తినను."

బిజలీ లేచి నిలువబడినది. ఈపర్యాయం ఆమె చేసిన పరిహాసంలో కొద్ది తీవ్రతవుంది. ఆమె కొంచెం గట్టిగాఅంది—నీవు తప్పక తింటావు. అది నిశ్చయంగా నేను చెప్పగలను. యివ్వాళ, రేపు కాకపోయినా, రెండురోజుల తర్వాతైనా తప్పక తింటావు.

సత్యేంద్రుడు తలవూపుతూ అన్నాడు—చూడండి, అపరాధాలు అందరూచేస్తారు. నా అపరాధం యెంత పెద్దదైందీ అందరూ యెరుగుదురు. మీ వల్లకూడ అపరాధం జరుగుతూవుంది. ఈరోజు గాదు, రేపటికి గాదు, యింకా నాలుగురోజులకు గాదు, మరి ఈజన్మకే కాదు, ముందుజన్మానికైనా తినను—నేను మీరు అంటుకున్న దాన్ని తినను. నాకు ఆజ్ఞయివ్వండి, వెళ్లుతా—మీ నిట్టూర్పుచే నా రక్తం క్షీణించిపోతూవుంది.

ఇదంతా ఆ త్రాగుబోతుకు అర్థంకాకపోలేదు. అతను తలవూపుతూ అన్నాడు—బిజలీ, 'అరసికేషు రహస్యనివేదనమ్' వెళ్లనీ వెళ్లనీ. ఆయన ప్రొద్దున్నే వచ్చి యీ ఆనందాన్నంతా మట్టిపాలు చేసివేశాడు.

బిజలీ జవాబేమీ యివ్వలేదు. ఆమె నిర్విణ్ణురాలై సత్యేంద్రుని ముఖంవైపుచూస్తూ నిలవబడినది. ఆమెవల్ల అపరాధం జరిగినమాట వాస్తవమే.

అటువంటి సిగ్గుగలమనిషి యీవిధంగా మాట్లాడగలుగుతాడని ఆమె అనుకోనైనా అనుకోలేదు.

సత్యేంద్రుడు కుర్చీలోనుండి లేచి నిల్చున్నాడు. బిజిలీ కోమలస్వరంతో అంది—"కొంచెంకూర్చో."

అది వినగానే త్రాగుబోతు అన్నాడు—ఊఁహూఁ, పోనివ్వు. అడ్డుపెట్టకు.

సత్యేంద్రుడు గదివెలిపలికి వచ్చివేశాడు. బిజిలీ వెనుకనుండివెళ్లి దారిఅడ్డగించి మెల్లగా చెప్పింది—వారు చూస్తారనీ పూరుకున్నా. లేనియెడల ఆసమయాన్నే నావల్ల అపరాధం జరిగిందని చేతులుజోడించి నీతో అనేదాన్ని.

సత్యేంద్రుడు బదులుచెప్పక ముఖం తిప్పుకున్నాడు.

బిజిలీ మళ్లీఅంది—ఈ ప్రక్కవున్న గదే నేను చదువుకునేగది. కొంచెంవెళ్లి చూడగూడదు? ఒకపర్యాయం లోపలికివెళ్లి చూడు. నేను నిన్ను క్షమాపణ కోరుతున్నా.

సత్యేంద్రుడు 'చూడను' అంటూ మెట్లవైపుకు వెళ్లాడు. బిజిలీ అతని వెనుకనే వెళ్లుతూ అడిగింది—రేపు మళ్లీవస్తావా?

"రాను."

"ఇంకెప్పటికీ రావా?"

"రాను."

దుఃఖంవల్ల బిజిలీ గొంతు గద్గదమైంది. శక్తికొలదీ గొంతును సవరించుకుని ఆమె అంది—ఇక యిక్కడికి రానంటున్నావు. దాన్ని నేను విశ్వసించను. ఇక రానట్లైతే చెప్పు. నామాట వోకటుంది దాన్ని నమ్ముతావా?

ఆమెయొక్క భగ్నస్వరం విని విస్మితుడైనాడు సత్యేంద్రుడు. కాని పదిహేను, పదహారు రోజులనుండి జరిగే అభినయాన్ని చూస్తూవుండడంవల్ల దాని ముందు అది వోక లెఖ్ఖగా లేకపోయింది. అయినా ముఖం తిప్పుకుని నిలబడినాడు. ఎంతచెప్పినా నమ్మడని అనుకుంది. కాని యేమిచేస్తుంది పాపం? విశ్వాసంగ్రహించే వుపాయాన్ని ఆమె తన చేతులారా యింటిలోని పాచిమోస్తరు వూడ్చి పారవైచింది.

సత్యేంద్రుడు అడిగాడు—విశ్వసింపవలసిన మాట?

బిజిలీకి పెదవులు కంపించినై. కాని నోటినుండి మాటరాలేదు. ఆమె కన్నీళ్లతో నిండిన నేత్రాలను వోకక్షణకాలం పైకియెత్తి వెనుకటిమోస్తరుగా క్రిందికి దించింది. దాన్ని సత్యేంద్రుడుకూడా చూశాడు. కాని కన్నీళ్లుకూడ దొంగవికాకూడదు? సత్యేంద్రుడు యెదురుచూస్తున్నాడని బిజిలీ శిరస్సు యెత్తకుండానే తెలుసుకుంది. కాని ఆమాటను నోటితో బైటికి చెప్పలేకుండావుంది. ఆమాట బైటకురావడానికి హృత్పింజరాన్ని వదులుచేసుకుంటూవుంది.

ఆమె సత్యేంద్రుని ప్రేమించసాగింది. ఆ ప్రేమలోని కించిత్తుభాగాన్ని అయినా సార్థకపరిచే లోభంచే వీలయితే ఆమె తన అసమానసౌందర్యం—శరీరం—కూడ వోక చింకిగుడ్డపేలికమోస్తరు త్యజించడానికి సిద్ధంగావుంది. కాని ఆమెను యెవరు విశ్వసించుతారు? ఆమె కళంకిత. తన సమస్తశరీరంలో కోట్లకొలది అపరాధచిహ్నాలకు తావిస్తూకూడ విచారణకర్త ముందు నిలబడి అపరాధాలుచేయడం నా వృత్తి అయినా యీపర్యాయం నేను నిర్దోషురాలను అని యే నోటితో చెప్పగలదు? ఆలస్యమౌతూవున్నకొద్దీ విచారణకర్త నాకు వురికి ఆజ్ఞయిస్తాడని ఆమె అనుకుంటూవుంది. కాని ఆమె అతన్ని యేవిధంగా అపుతుంది? సత్యేంద్రుడు అధీరుడై అన్నాడు—వెళ్తున్నా.

బిజిలీ శిరస్సు యెత్తలేకపోయింది. కాని యీపర్యాయం నోటినుండి మాటవచ్చింది. ఆమె

అన్నది—కాని ఆ పాదమస్తకం నేను అపరాధాలతో నిండివున్నప్పటికీ, దేన్నైతే విశ్వసించుచున్నానో, దాన్ని నీవు విశ్వసించక అపరాధుడవు కావద్దు. అందరి శరీరంలో భగవంతుడు వుంటాడనీ, భావనంతను యేమనిషినైన వదిలిపెట్టిపోడనే విషయం నమ్ము.

కొంచంసేపు యేమీ మాట్లాడక మళ్లీ అంది—అన్ని దేవాలయాల్లో దేవతకు పూజ జరగనిమాట వాస్తవమే. అయినప్పటికీ దానిలోవుండేది దేవతే. దేవతనుచూచి శిరస్సు వంచకపోయినా తన్నుకుంటూ పోలేము.

ఆవిధంగా చెప్పుతూవుండగానే కాళ్లచప్పుడు విని శిరస్సునెత్తి చూచింది. సత్యేంద్రుడు మెల్ల మెల్లగా పోతూవున్నాడు. స్వభావానికి విరుద్ధంగా విద్రోహంచేయవచ్చు కాని బొత్తిగా తీసివేయలేం దాన్ని. స్త్రీ శరీరమ్మీద వందలకొలది అత్యాచారాలు చేయవచ్చు. కాని స్త్రీత్వాన్ని అస్వీకరించలేం! బిజలీ వొకవర్తకిఅయినా స్త్రీయేగా! పుట్టుక మొదలు అనేక అపరాధాలుచేయడంవల్ల అపరాధినిఅయినా ఆమె శరీరం స్త్రీశరీరమే. ఒక గంట తరువాత తనగదిలోనికి వచ్చింది. ఆసమయంలో తిరస్కరింపబడి అర్థమృత్యుప్రాయమైన ఆమెయొక్క నారీప్రకృతి అమృతస్పర్శవల్ల మేలుకుంది. ఆ కొద్దిసమయంలోనే ఆమె శరీరంలో అంతులేని పరివర్తన జరిగిందని ఆ త్రాగుబోతుకూడ తెలుసుకున్నాడు. చివరకు అతను నోరువిప్పి అన్నాడు—నీ కనురెప్పలు తడిచివున్నవేం? అంత పట్టుదలగల మనిషి గాబట్టే యింత మంచివస్తువులుకూడ నోట్లో వేసుకోలేదు. సరే, ఆపల్లెం యిట్లా తీసుకురా.

ఆవిధంగా అని తానే ఆపల్లెం లాక్కుని తిన సాగాడు త్రాగుబోతు.

కాని అతను చెప్పినమాట వొకటీ బిజలీ చెవున పడలేదు. అగస్మాత్తుగా ఆమెదృష్టి తన పాదాల వైపుకు వెళ్లింది. రెండుపాదాలకు కట్టబడివున్న గజ్జెలు తేళ్లమోస్తరు కుడుతూవున్నట్లు భావించింది. ఆమె త్వరత్వరగా వాటిని విప్పి పారవేసింది.

ఒకడు అడిగాడు—గజ్జెలు విప్పావా?

బిజలీ తలనెత్తి కొద్దిచిరునవ్వుతో అంది—ఔను, ఈరోజునుండీ వీటిని కట్టుకోను.

"అంటే?"

"అంటే దానిఅర్థం కట్టుకోనని. మీ బిజలీ చచ్చిపోయింది!"

త్రాగుబోతు మిఠాయి తింటూ అన్నాడు—అసలు జబ్బేమిటి?

బిజలీకి నవ్వువచ్చింది. ఆమె నవ్వుతూనే అంది—మీ బిజలీ వొక విచిత్రమైన జబ్బుచే మరణించింది. దానితో దీపం వెలిగించగానే అంధకారం నాశనమౌతుంది. సూర్యుడు వుదయించడంతోనే రాత్రి అంతరిస్తుంది.

## ౬

నాలుగు సంవత్సరాలు గడిచినై. కలకత్తాలోని వొక మనోహరభవనంలో వొక పెద్దజమీందారుని యొక్క కుమారుని అన్నప్రాశనమహోత్సవం జరిగింది. భోజనాలహడావిడీఅంతా అయిపోయింది. సాయంకాలం నాట్యప్రయత్నాలు జరుగుతూవున్నై.

ఒకవైపున ముగ్గురు నలుగురు నర్తకురాండ్రు కూర్చునివున్నారు. నాట్యంచేసేది వారే. రెండో అంతస్థులో పరదా తడికెచాటున వొంటరిగాకూర్చుని వచ్చేవారినందరిని చూస్తూవుంది రాధారాణి. ఆహ్వానింపబడిన స్త్రీలు యింతవరకురాలేదు.

సత్యేంద్రుడు నెమ్మదిగా వెనుకనుండివచ్చి మెల్లగా అన్నాడు—అంతధ్యానంగా చూస్తూవున్నావేమిటి?

రాధారాణి తనభర్త ముఖంవైపుచూచి నవ్వుతూ అంది—అందరూ యెవరినైతే చూడడానికి వస్తున్నారో వారిని చూస్తున్నా. ఆ వచ్చిన నర్తకురాండ్ర అలంకారం చూస్తూవున్నా. కాని, మీరు యీసమయంలో యిక్కడికి వచ్చిన పనియేమి?

భర్త నవ్వుతూ జవాబిచ్చాడు — నీవు వొంటరిగా కూర్చునివుండడంవల్ల కొంచెం మాట్లాడదామనివచ్చా.

"వెళ్లిపోండి."

"నిజంగా! సరే, వాళ్లందర్లో యెవరు నీకు బాగున్నారో చెప్పు."

రాధారాణి 'ఆమె' అంటూ వ్రేలితో అందరి వెనుక సాధారణపు గుడ్డలను ధరించివున్న స్త్రీవైపు చూపిస్తూఅంది.

సత్యేంద్రుడు అన్నాడు—ఆమె దుర్బలంగా రోగిష్టిలాగావుంది.

"కావచ్చు. కాని ఆమే అందరికంటె సౌందర్యవతి. పాపం, పేదరాలుగా కన్పిస్తూవుంది. వంటికి సొమ్ములుకూడాలేవు.

సత్యేంద్రుడు తలవూపుతూ అన్నాడు—వాళ్లకు యిచ్చేడబ్బు యెంతో తెలుసునా?

"తెలియదు."

సత్యేంద్రుడు చేత్తో చూపిస్తూ అన్నాడు—ఆ యిద్దరికీ చెరి ముప్ఫైరూపాయలు, ఆమెకు యాభై రూపాయలు, నీవు పేదరాలు అని చెప్పిన ఆమెకు రెండువందల రూపాయలు.

రాధారాణి వులిక్కిపడి అంది—రెండు వందలు! ఎందుకు? బాగా పాడుతుందా?

"పాట యెప్పుడూ వినలేదు. అయిదు సంవత్సరాల క్రిందటివరకూ బాగా పాడుతూవుండేది అని అందరూ అంటున్నారు. కాని యిప్పుడు బాగా పాడుతుందో లేదో చెప్పలేను."

"అయితే అన్నిరూపాయలు యిచ్చి యెందుకు పిలవనంపాలి?"

"అంతకంటె తక్కువడబ్బుకు రాదు. ఈడబ్బుకు కూడా రావడానికి వొప్పుకోదు. చాలకష్టంమీద బ్రతిమిలాడగా వచ్చింది.

రాధారాణి యింకా విస్మితురాలై అడిగింది—డబ్బిస్తూకూడ బ్రతిమిలాడడం యెందుకు?

సత్యేంద్రుడుదగ్గరగావున్న కుర్చీని వొకదాన్ని లాక్కుని దానిలోకూర్చుని అన్నాడు—ప్రస్తుతం ఆమె ఈ వృత్తిని వదలిపెట్టడమే మొదటికారణం. ఆమెలో యెంత మంచిగుణాలున్నా త్వరగా అన్ని రూపాయలుయిచ్చి ప్రతివారూ పిలవనంపలేరు. అందుచే ఆమెకు యెక్కడికీపోయే అవసరంవుండదు. ఇది ఆమె స్వభావం. ఇంకా రెండో కారణం నా ముఖ్యఅవసరం.

ఈమాటను విశ్వసించలేదు రాధారాణి. అయినప్పటికీ ఆసక్తితో ఆమెకొంచెం ముందుకుజరిగి అన్నది—నీకు ఆమెతో అవసరంలేకేం? అవసరంవుందంటే నేను నమ్మను. అయితే ఆమెవృత్తిని వదలిపెట్టడానికి కారణం?

"వింటావా?"

"ఆ. చెప్పండి"

సత్యేంద్రుడు క్షణకాలం యేమీమాట్లాడక తర్వాత అన్నాడు—ఆమె పేరు బిజలీ ఒకప్పుడు—కాని రాణీ, ఇక్కడకు చాలామందివస్తారు. లోపలికి వస్తావా?

"పదండి" అంటూరాధారాణి వెంటనేలేచి నిలువబడినది.

* * *

రాధారాణి భర్తపాదాలదగ్గరకూర్చుని మాటలన్నీ విన్నది. చివరకుపమిటెతో కండ్లుతుడుచుకుని అంది ఆకారణంచే ఈదినం ఆమెను అవమానించి బదులు తీర్చుకుంటారా?

సత్యేంద్రుని నేత్రాలుకూడ పొడిగాలేవు. మాట్లాడే సమయాన అనేకపర్యాయాలు అతనిగొంతు గద్గదమైంది. అతను అన్నాడు—ఔను, అవమానమే. కాని మనం ముగ్గురముతప్ప యింకెవ్వరూ దీన్ని తెలుసుకోజాలరు. దాని విషయంకూడ అంతుపట్టదు.

రాధారాణి యేమీజవాబివ్వలేదు. వొకపర్యాయం పమిటెతో కండ్లుతుడుచుకుని బైటికి వెళ్లిపోయింది.

ఆహ్వానించివున్న పెద్దమనుష్యులతో స్థలంఅంతానిండి పోయింది. రెండో అంతస్థునుండి లజ్జతోగూడిన స్త్రీలమాటలశబ్దం పరదాలెడికెల ఆవరణాన్ని ఛేదించుకుని బైటికివస్తూవుంది. మిగతానర్తకురాండ్రంతా నృత్యంచేయడానికి సిద్ధంగావున్నారు. కాని బిజలీమాత్రం యింతవరకు తలవంచుకుని మెదలకుండా కూర్చునేవుంది. ఆమెనేత్రాలనుండి అశ్రువులు ప్రవహిస్తూవున్నై. ఆమె మొదటసంపాదించిన ధనమంతా ఈ నాలుగు సంవత్సరాలలో చాలవరకు ఖర్చైపోయింది. ధనాభావంచే వివశురాలై శపథపూర్వకంగాత్యజించిన కార్యాన్నికూడ స్వీకరించింది. కాని తలయెత్తుకుని నిలబడలేకపోయింది. అపరిచిత పురుషులదృష్టిముందు శరీరం రాయి మోస్తరుబరువు అవుతుందని, పాదాలువిరిగి పోవడానికి సిద్ధంగా వుంటవనీ, రెండుగంటలకు పూర్వం ఆమె అనుకోనైనా అనుకోలేదు.

"మిమ్మల్ని పిలుస్తున్నారు."

బిజలీ కండ్లెత్తిచూచింది. పన్నెండు, పదమూడు సంవత్సరాలపిల్లవాడు నిలబడివున్నాడు. అతను రెండో అంతస్థువైపు చూపిస్తూఅన్నాడు — అమ్మగారు మిమ్మల్ని పిలుస్తున్నారు.

బిజలీ విశ్వసించక అడిగింది — పిలిచేది యెవరు?

"అమ్మగారు."

"నీవెవరవు?"

"నేను వారి నౌకర్ని."

బిజలీ తలవూపుతూఅంది — కాదు, బహుశ నన్ను పిలిచివుండరు. నీవు యింకోపర్యాయం వెళ్లి కనుక్కునిరా.

ఆపిల్లవాడు కొంచెంసేపటికి మళ్ళీవచ్చిఅన్నాడు. మీపేరేగా బిజలీ? మిమ్మల్నే పిలుస్తున్నారు. నాతో రండి అమ్మగారు నిలబడివుంది.

బిజలీ త్వరత్వరగా కాళ్లగజ్జెలువిప్పి ఆపిల్లవాని వెంట యింటిలోనికి వెళ్లింది. యజమానురాలు తనకు బాగుండేపాటను పాడమని చెప్పడానికి నన్నుబహుశ పిలిచివుంటుదని తలచింది. శయనాగారపు వాకిటి ముందు రాధారాణి పిల్లవాణ్ణియెత్తుకుని నిలబడివుంది. కొంచెం గాబరాతోగూడిన సంకోచంతో మెల్ల మెల్లగా బిజలీ ఆమెవద్దకువెళ్లి నిలువబడినది. రాధారాణి ఆదర పూర్వకంగా ఆమెచేతిని పట్టుకుని లోపలికి తీసుకునిపోయింది. బలవంతంగా వొక కుర్చీలో కూర్చొబెట్టుతూ అంది — అక్కయ్యా, నన్ను గుర్తుపట్టగలవా? ఒకవేళ నీచెల్లెల్ని నీవు గుర్తు పట్టలేకపోతే లేకపోవచ్చు దానికి విచారమేమీ లేదు. కాని నీవు యీపిల్లవాణ్ణికూడ చూచి గుర్తుపట్టలేక పోతే నిజంగానీతో పోట్లాడవలసివస్తుంది!

ఆమె అట్లాఅని చిరునవ్వునవ్వింది. ఆచిరునవ్వు చూచి కూడ బిజలీకి నోటినుండి మాటరాలేదు. అయినా ఆమెయొక్క అంధకారపూర్ణ ఆకాశం కొంచెం కొంచెంగా స్వచ్ఛంకాసాగింది. ఆ అనింద్యమాతృ ముఖాన్ని చూడడం మాని అప్పుడే వికసించిన గులాబీ పువ్వంటీతివున్న శిశువు ముఖంవైపుకు కన్నార్పకుండా చూస్తూవుంది. రాధారాణి నిస్తబ్ధురాలయింది. బిజలీ చాలసేపటివరకు ఆశిశువువైపు కన్నార్పకుండాచూచి వొక్కపర్యాయంగా లేచి నిలువబడినది. రెండు చేతులుచాచి ఆపిల్లవాణ్ణి వడిలోనికి తీసుకుని గట్టిగా రొమ్ముకేసి అదుముకుంటూ యేడ్వసాగింది. రాధారాణి అడిగింది—అక్కయ్యా, గుర్తుపట్టావా?

"ఆ గుర్తుపట్టా."

రాధారాణిఅంది—అక్కయ్యా, నీవు సముద్రాన్ని చిలికి దానిలోనుండి వచ్చిన విషాన్ని నీవుత్రాగి, అమృతాన్నంతా నీచెల్లెలికి యిచ్చివేశావు. వారునిన్ను ప్రేమించారు కనుక నేనే వారిని చేపట్టగలిగాను.

సత్యేంద్రుని చిన్నఫోటోఒకటి తీసుకుని బిజలీ కన్నార్పకుండా చూస్తూవుంది. తలయెత్తిఅంది— విషముయొక్క విషమే అమృతం. నాకుకూడ లభించక

పోలేదు. ఆవిషం ఈఘోరపాపిష్టురాల్ని కూడ చిరంజీవురాలను గా చేసింది.

రాధారాణి ఆ మెమాటకు బదులేమి చెప్పక అన్నది నాకిని వొకపర్యాయం చూస్తావా?

బిజలీ క్షణకాలం కండ్లుమూసుకుని స్థిరచిత్తురాలై అంది—చూడను నాలుగుసంవత్సరాలకు పూర్వం వొకదినం యీఅస్పృశ్యురాలను గుర్తుపట్టిఅసహ్యంతో ముఖంతిప్పుకుని ఆయన వెళ్లిపోయాడు. ఆదినం నేను దర్పంతో నావద్దకు తప్పక వస్తావుఅని అన్నా నా ఆ దర్పం చూర్ణమైంది. ఆయనమళ్లీ నాదగ్గరకురాలేదు. కాని దర్పనాశకుడైన భగవంతుడు నాదర్పాన్ని నాశనం యెందుకుచేసిందీ నాకు యిప్పుడు తెలిసింది. ఆయన (భగవంతుడు) లాక్కొని యేవిధంగా యివ్వగలిగేది నాకు తెలిసినంతగా యెవరికీ తెలియదు.

వొకపర్యాయం పమిటతో బాగా కండ్లుతుడుచుకుని ఆ మెమళ్ళీ చెప్పసాగింది-- నేను అపారమైన ఆర్థికకష్టంవల్ల భగవంతుణ్ణి నిర్దయుడు, నిష్ఠురుడు, అని ఆనేక దోషాలు మోపాను. కాని యీపాపిష్టురాలి మీద యెంతదయ చూపెంచిందీ నాకిప్పుడు తెలిసింది. ఒకవేళ భగవంతుడు నాకు మళ్ళీ ఆయన్ని తిరిగి యిచ్చివుంటే నేను అన్నివిధాల నాశనమైపోయివుండేదాన్ని ఆయన్ని పొందలేక పోగా నన్నుకూడా నాశనం చేసుకునేదాన్ని.

దుఃఖంచే రాధారాణి నోటినుండి మాటరాలేదు. అందుచే యేమీచెప్పలేక పోయింది. బిజలీ యింకో పర్యాయంచెప్ప మొదలుపెట్టింది. ఒకవేళ యెప్పుడైనా ఆయన కనుపించితే పాదాలుపట్టుకుని మళ్ళీ వొకపర్యాయం క్షమాపణకోరాలని అనుకున్నా. కాని యిప్పుడు దానితో పనిలేదు. నాకు కేవలం ఆఫోటోయివ్వు దీనికంటె వేరే నాకింకేమివద్దు. ఇంకేమైనా కోరుకుంటే భగవంతుడు సహించలేడు— మంచిది నేను వెళ్లుతున్నా.

అంటూ బిజలీ నిల్చున్నది. రాధారాణిగద్గద స్వరంతో అంది — మళ్లీయెప్పుడు కనుపించవదం అక్కయ్యా?

"ఇక కనుపించేదిలేదు. నాకొక చిన్నయిల్లువుంది. వీలైనంత త్వరగా అమ్మివేసి యిక్కడినుండి వెళ్లిపోతా. కాని వొకవిషయం చెప్పగలవా? ఇన్నిదినాలతర్వాత అకస్మాత్తుగా ఆయనకు నాస్మరణ యెందుకు కలిగింది? నాకరు నన్ను పిలవవచ్చినప్పుడు మీరుపేరు యెందుకు చెప్పాడు?

లజ్జతో రాధారాణిముఖం యెఱ్ఱబారింది. శిరస్సువంచుకుని యేమీమాట్లాడలేదు.

బిజలీ కొంచెంసేపు ఆలోచించుకుని అంది-నాకు తెలిసిందిలే నన్ను అవమానించదలచుకున్నాడు అందుచేతనా? యీవిధంగా యిన్నిప్రయత్నాలుచేసి నన్ను పిలవనంపడానికి వేరే కారణం యింకేమివుండదు.

రాధారాణితల యింకావంచుకుంది. బిజలీనవ్వుతూ అంది-దీనికి నీవు సిగ్గుపడడం యెందుకు? కాని ఆయన పొరపాటుపడినాడు. ఆయన పాదాలకు నానూరు కోట్ల ప్రణామాలని తెలియజేస్తూ ఆవిధంగా జరగడానికి వీలులేదనిచెప్ప నాఅని చెప్పదగ్గది నావద్ద యేమీలేదు. నన్ను అవమానించినట్లైన ఆ అవమానమంతా ఆయనకే.

"మంచిది అక్కయ్యా, నమస్కారం."

"నమస్కారం. నీకంటె వయస్సులో పెద్దదానినైనా నిన్నాశీర్వదించే అధికారం నాకులేదు. నీ చేతిగాజులు చల్లగా వుండవలెనని నేను మనోవాక్కులతో భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నా. పోయివస్తా."

అనువాదకుడు

ఎస్. వెంకటసుబ్బయ్య చౌదరి.

# వివాహములు

శ్రీమతి వింజమూరి వేంకటరత్నమ్మగారు

నేఁటి హిందూవివాహసమస్య చాల క్లిష్టముగానున్నది. అన్నిటిలో బ్రాహ్మణ బాలికావివాహములు క్లిష్టతమముగా నున్నవి. క్రైస్తవమతము వారి కే యిబ్బంది యునున్నట్లు కన్పట్టదు. వారిలోఁ బ్రతి కన్యయు వీలగునంత, ప్రాప్తమున్నంత, విద్య నార్జించి, తనస్థితిగతులకు దగినట్లు తానాత్మ పోషణ మొనర్చికొనఁగలుగు మార్గమరసి, పిమ్మట ననుకూలవరుని సంపాదించుకొనును. వరాన్వేషణములోఁ దల్లిదండ్రులు, వధువు సమానముగా బాధ్యతవహించి పాటుపడుదురు. వారిపద్ధతి యేదోయొక్క నిర్ణయమునకు వచ్చియున్నదనవచ్చును.

మహమ్మదీయులలో 'ఘోషా' యింకను విశేషముగా నిలిచియుండుటచేత వారి యవస్థ మతియు శోచనీయమైయున్నది. వారిలో శ్రీమంతుల బాలికలే యుచితవిద్య నార్జింపఁగలుగుచున్నారు. తక్కుంగల జనసామాన్యమున కంతగా విద్య యలవడుచున్నట్లు తోఁపదు. వారి 'ఘోషా'యే వారికిఁ బెద్దయాటంకముగానున్నది. నాగరకత బలిసిన కొలఁది వారియందు నానాఁట 'ఘోషా' నశించి విద్యాభివృద్ధి గలుగుచున్నది. వివాహములపట్ల వారి మతపుఁ గట్టుఁబాటుమాత్ర మింకను మిగుల జిగివహించియేయున్నది. హిందూస్త్రీ యే మహమ్మదీయయువకునో క్రైస్తవయువకునో, పెండ్లియాడిన కథలు విశేషముగా వినుచున్నాముగాని, మహమ్మదీయ వనితగాని, క్రైస్తవకాంతగాని యిట్లు పరమతిపురుషుని నుద్వాహమాడినట్లు సాధారణముగా వినము. ఎక్కడనేని కోటికొక్కవ్యక్తి యట్టిదున్నను లెక్కలోనికిరాదు. రాజపుత్రిరమణి యొక మ్లేచ్ఛపూరుషుని చెట్టఁబట్టినన లోకము సహించుచున్నది. కాని యేమహమ్మదీయ కళావతియో శివాజీనిజూచి మోహించినదని యున్న నిజము తెల్పినను సైఁపకున్నది. ఈ నడుమ రాజమహేంద్రపురములో నొక తురకకన్నె యొకబాపనపడుచువానిని వరించినది. కన్నెవంకవారు వరుని మెడలువంచి వానికిఁ దురకమతమిప్పించి వారిధర్మవిధిని బరిణయమొనరించిరి. కాని యదిబలవంతముగాఁ గట్టఁబడిన మతధర్మమగుటచే నా కుఱ్ఱవాఁడు మరల స్వమతస్వీకారమొనర్చి యువతినిగూడఁ దనమతములోనికి దింపి యేలుచున్నాఁడఁట. ఇట్టి దెక్కడనో కాని లేదు.

శారదాబిల్లు నాచరణములోనికిఁ బెట్టుదురని తెలిసినతోడనే మొదట పూర్వాచారపరాయణులు తొందరపడి వివాహములు చేసినారు. ఇంచుక సంస్కరణోద్దేశములు గలవారెల్లరు నిదియే యదననియెంచి

యాచట్టము నాధారముగాఁ దీసికొని తమ యాఁడుబిడ్డలకుఁ బెండ్లిండ్లుచేయక నిల్చిపోయినారు. మఱికొందఱు పెద్ద లా భయముచే నే యేనామోవెళ్లి పెండ్లిండ్లు చేయుచున్నారు. ఇంకను గొందరుపిల్లలు వ్యక్తురాండ్రయినసంగతి కప్పిపుచ్చి, పదేను పదాఱేండ్లు కన్నెకు వచ్చినమీఁదటఁ దమ కనుకూలమగు సంబంధముచూచి పెండ్లిచేసి, యావల రజస్వలావినోదములు జరుపుచున్నారు. ఇఁకఁ గొలఁదిమంది, జంకుగొంకులు లేనివారు, పెద్దల భూషణతిరస్కారములకు వెఱవనివారు గలరు. వారు తమబిడ్డలను లెస్సఁగాఁ జదివించుచు నుత్తమవరుని వెదకుచు శుభసమయ సమీక్షణ మొనర్చుచున్నారు. అట్టి వారు పల్లెలలోనున్న సంఘబాహ్యులగుచున్నారు. మా కాకినాడవంటి పట్టణములనైన గొంచెపువెలికి గుఱియగుచున్నారు. చెన్నపురివంటి మహాపట్టణములోనైన నెట్టిబాధయు సాంఘికధాటియుఁగాంచక నెగడుచున్నారు.

హిందువులలో వైశ్య బ్రాహ్మణకులములకుఁ దక్కఁదక్కినవారల కంతబాధలేదు. వారిలోఁగూడ నాంధ్రులయందు సంఘబాధ మిక్కుటముగాఁ జూపట్టుచున్నది. ఆంధ్రులలోఁ బల్లెలలోఁ జిన్నపురములలోనున్న వారికే యీ సాంఘికదండయాత్ర గలుగుచున్నది. వారినిగూర్చియే నే నిందుఁ గొంత చెప్పఁబూనుచున్నాను.

మా సీమలో బూర్వకాలమువారు స్త్రీ శిశువు పుట్టినదన్న దానికిఁ జిన్ననాఁటి నుండియు మగనిమాటలే చెప్పుచుఁ జుట్టములలో నీడుజోడుగనుండిన ప్రతిబాలుని దాని మగఁడనియే కనఁబఱచుచుందురు. చిన్నబిడ్డలాడునాటలు, పాడు పాటలు, చేయు నోములు ఇవన్నియు భార్యభర్తల సంబంధముఁగూర్చియేయుండును. ఆకారణముగఁ బూర్వకాల స్త్రీకి నుగ్గుఁబాలతోనే గృహనిర్వహణత్వము, పతిభక్తి, యతిథిపూజ, యిత్యాదుల తెలివిగలుగుచుండెను. ఆకాల స్త్రీకి గృహమునుమించిన యాశయమేలేదు కావున నున్నతవిద్య యక్కఱలేకపోవునది. కుటుంబములో స్త్రీకి వ్యక్తిత్వమంతగా నుండునదికాదు. కాని యిప్పుడు కాలము మాఱినది.

శ్రీ రాజారామమోహనరాయ లవతరించినదిమొదలు హిందూస్త్రీకి వ్యక్తిత్వమేర్పడినది. సంసారశకటమును సరళిగాలాగుటకుఁ బురుషునితోఁ బాటు స్త్రీయు సమాన భారము వహించుచున్నది. పాశ్చాత్య నాగరకత హెచ్చినకొలఁది, నాభారమును హెచ్చుచున్నది. ప్రాక్పశ్చిమాచారసమన్వయము మనదేశమునఁగలిగినది. నేఁటి గృహిణి భర్తయడుగులకు మడుఁగులొత్తుచు వర్తించు దాసియుఁగాదు, భర్తను నిలువఁబెట్టి తాను గురిచిపై నధివసించి యధిక గౌరవములకాసించు దొరసానియుఁగాదు. సుఖదుఃఖములలో, నాపత్సంపదలలో, గౌరవాగౌరవములలోఁ బతితో సమభాగిని యైయుండును. ఆకారణమున నామె పూర్వ హిందూవనితవలె నింటిలో నణఁగిమణఁగి

యుండవీలులేదు. అట్లని బరితెగివర్తింపను వలనుపడదు. ఈస్థితి కనుకూలమగు పద్ధతిని వర్తింపఁగోరుచు నేఁటి బ్రాహ్మణకుటుంబములలో నున్నతాశయముగలవారు తమ యాఁడుబిడ్డలను శిక్షణములోఁ బెట్టుచున్నారు. ఆ బిడ్డలకు సామాన్యసాహిత్యమే కాక, సంగీతాది లలితకళలలోఁగూడఁ బ్రావీణ్యము గల్గింప యత్నించుచున్నారు. అట్టి విద్యాప్రవీణులగు వనితలు తమ కన్ని విధముల ననురూపగుణులగు భర్తలతో గాఁపురమునే కోరుచు, నట్టివారు దొరకక, తబ్బిబ్బుపడుచున్నారు. తగినవారు దొరకనప్పుడు వారస్యకులములకుఁ బోవుటకును సాహసించుచున్నారు. ఆకారణమున జాతి సాంకర్యముగలుగుచున్నది. అది యభివృద్ధి చిహ్నమే కావచ్చును. సనాతనమతము వారమని చెప్పుకొను మహాత్ములుసైతమే కులమునకుఁ జెందక పోవుచున్నారు. ఇట్టిస్థితి చాలమంది జానపదులకుఁ బౌరులకుఁగూడఁ గలుగుచున్నది.

జనపదములోను జిన్నపురములలోనుగల బాలికలకు విశేషవిద్య యలవడకున్నది. విశేషవిద్యలేకున్న, సరియైన నాగరకతయు లభింపకున్నది. దానినిబట్టి వారి యాశయములు సరళిగా నుండకున్నవి. వారి పెండ్లిండ్లకుఁ జాలఁజిక్కులు గలుగుచున్నవి. కొంత విద్య యేస్కూలుఫైనలువఱకో నేర్చినపిమ్మట, వనితలు పూర్వసంప్రదాయ ప్రకారము వివాహమాడ నిచ్ఛగింపరు, నవీన పద్ధతుల కంజవేయనులేరు. వారి తలిదండ్రులు మహాపురవాసులవలె సంఘమును ధిక్కరించి వర్తింపలేరు. ప్రాచీనాచారములఁ బట్టి ప్రాఁకులాడనులేరు. ఆర్థికసమస్యయు మహాధనవంతులకు నిఱుపేదలకును జెందక మధ్యస్థితిమంతులకే చెందునట్లు వివాహ సమస్యయు నడిమిస్థితిగలవారికే కష్టముగాఁ దోఁచుచున్నది. ఈమధ్యస్థితిమొదలు హైందవ సంప్రదాయములు,నవీనభావములు లెస్సఁగా సమ్మేళనముగావించి తమ బాలికలకు నుత్తమపద్ధతులపై వివాహములనొనర్చి భావిభారతజాతి కాదర్శప్రాయులఁగుదురు గాక యని కోరుచున్నాను.

---

## ప్రేమ

రోజా

ప్రేమ చాలకాలము కష్టపడుతుంది
అది కరుణామయి
ప్రేమ ఈర్ష్యఁజెందదు
పొగడ్తకు లోనుగాదు
అసహ్యముగా ప్రవర్తించదు
స్వార్థము చూచుకోదు
కినుక జెందదు
చెడును లక్ష్యముచేయదు
అవినీతితో ఆనందించదు
సత్యముతో సంతోషిస్తుంది.
అన్నిటిని భరిస్తుంది
అన్నిటిని నమ్ముతుంది
అన్నిటిని ఆశిస్తుంది
అన్నిటిని సహిస్తుంది
ప్రేమ ఎన్నటికి నశించదు.

# పండుగ పట్టుచీర

మం. రం.

"ఈచీర బెంగుళూరుదండి. రంగు గ్యారంటీ చేస్తాము, మాదగ్గర కల్తీసరకుండదండి."

అన్నాడు గోపయ్యసెట్టి కనకాంబరం రంగుకు తగిన ఆకుపచ్చ అంచుమీద జరీతోనున్న చీరను అద్దాల బీరువాలోనుంచి తీస్తూ.

సీతమ్మకు తీసినకొద్దీ, చూచినకొద్దీ ఆనందమెక్కువగుచున్నది. పది పది పేనురంగులలో చూచినది చూడకుండా చూస్తున్నది. అన్నీ బాగనేవున్నాయి. ఏది యెంచుకునేందుకు తోచలేదు.

"ఏమోయీ దీనివెల యెంత? రంగుంటుందా? యెన్నిగజాలు?" అని మాటమీదమాట వరుసగా ప్రశ్నలు వేసింది.

గోపయ్యసెట్టి ఆప్రశ్నలకన్నిటికి జవాబుచెప్పి తనదగ్గరున్న మేలైనసరకులన్నీ దెచ్చి మేటులుమేటులుగా పడేసాడు.

"సరేబాగానేయున్నది. ఖరీదు పాతికరూపాయలకు కొంచమేనా తగ్గవా?"

"లేదండమ్మగారు తమదగ్గర రెండుమాటలు లేవండి. తగ్గిస్తే మాకు లాభములేదండి సిసలైనధర చెప్పానండి."

చేరమైతే ఆడిందిగాని డబ్బెక్కడనుంచి తెస్తుంది. ప్రక్కయింటిప్లీడరుగారిభార్య పండుగకు క్రొత్తచీరకొనుక్కోవాలని పట్టుబట్టలషాపుకువెళ్లితే తనుకూడా చూస్తానని వెళ్లి వుండలేక మొగుణ్ణడిగి కొనుక్కుందామని ఆశపడింది. నచ్చకపోతే తిరిగి పంపిస్తానని యింటిదగ్గర మొగవాళ్లుచూడాలని సెట్టికి చెప్పి యింటికి ఆచీర తెచ్చింది. పెట్టెలోపెట్టింది.

దీపాలు వెలిగించగానే ఆవెల్తుర్లో ఆచీర యెల్లా వుంటుందో చూడాలని తీసిచూచింది. కండ్లుచెదిరి పొయ్యేటట్లు మెరిసిపోతోందాపట్టు. తనవంటిమీద ఒకసారి పెట్టుకుని చూసుకుంది. "అబ్బా! యెంత బాగుంది!" అనుకుంది. దగ్గరనుండి దూరమునుండి ఆచీర రంగుచూసింది. మళ్ళీపెట్లో పెట్టింది.

నారాయణమూర్తికి జిల్లాకోర్టులో గుమాస్తాపని. నెలకు రు. 30 జీతం. అయితేనేం దానికిమించినఖర్చు. పిత్రార్జితంయేమంత లేకపోయినా ఒక్కపాత పెంకుటిల్లు మాత్రం మిగిలినది. ఆయింట్లోనే యీస్వల్పజీతంతో లేదనకుండా వెలుగుల్లోతలెత్తుకుని తనూ భార్యసీతమ్మ, మూడేండ్లకూతురు కాపురముచేస్తున్నారు. తనజీతంలో కూడా దమ్మిడీ మిగలనందున యెప్పటికప్పుడు కటకటలాడిపోతూ వుంటాడు.

పాపం సీతకూడా భర్తకు అనుగుణ్యముగానే యెంతో పొదుపుగా సంసారము గడుపుతున్నది. తనకు లేదని అసంతృప్తిలేదు. ఉన్నదాంతో సంతోషముగా వుంటుంది యెప్పుడూ.

అట్లాంటిది చిన్నతనమైతేనేమి పరదాపడి అయితేనేమి తనస్థితి అప్పుడు మర్చిపోయి ఆచీర యింకా డబ్బు యివ్వకుండానే యింటికి తీసుకువచ్చింది.

తెల్లారితే భోగిపండుగ. భర్తకు తనుచేసినదెల్లా తెలియపరచడం? ఒకవేళ తనుక్రొత్తచీర కావాలని అడుగుతేమాత్రం యింతఖరీదులో తెస్తాడుగనుకనా. ఎప్పుడూ తెచ్చినట్లే ఏనాలుగురూపాయలకో తెస్తే బ్రహ్మాండం. ప్రొద్దున్ననగావెళ్లి చీకటి పడేటప్పటికి కోర్టులో పనిచేసి వస్తాడు అలసివుంటాడు. అప్పుడు చెప్తే మొదలుకే చెడుతుంది చేరం.

అందుకని ఆరోజుకు ఊరుకుంది.

* * *

"రేపుపండుగ తెలుసునా" అంది భర్తకు కాళ్లు కడుక్కునేందుకు నీళ్లు అందిస్తూ.



మిసర్స్. మానిక్లాల్ ప్రేమచంద్. సుప్రసిద్ధ రచయితులైన ప్రేమచంద్ గారి సతీమణి. అంతర్జాతీయ స్త్రీలసంఘమునకు ఉపాధ్యక్షులుగా ఎన్నుకొనబడిరి.



శ్రీమతి కె. కమలాదేవి. ఏలూరు జిల్లాబోర్డు సభ్యురాలుగా నియమింపబడిరి.

"అవును అయితే?"

"అయితేనేమిటి? చీకటితో నే లేచి మీరు మీ అమ్మాయి భోగిమంట వేసుకుని తలంటుకోవాలి."

"సరేలే రేపటిమాట యిప్పుడెందుకు."

"బాగుంది యిప్పటినుంచి అన్నీ సిద్ధంచేసుకోకపోతే రేపే అన్నీ యెక్కడదొరుకుతాయి? దాసీదాన్ని కూడా త్వరగా రమ్మని చెప్పాను."

నోటిచివరదాకా వస్తున్నది తనచీరమాట కాని నాలికకరుచుకొని వెనక్కులాక్కుంది.

తెల్లారకుండానే సీతభర్తను కూతురు లక్ష్మినిలేపి తలంటింది. తరువాత తను తలంటుకున్నది. పన్నెండు గంటలకల్లా పిండివంటలతో సహాభోజనాలయినవి. నారాయణమూర్తి మూడుగంటలకే కాఫీత్రాగి బయటకువెళ్లిపోయినాడు. ఇంక సీత శృంగారించుకుని కూతురిని ముస్తాబుచేసింది. కూతురుకి భోగిపండ్లు పోసేందుకు చుట్టుపక్కలవాళ్లను నలుగురిని పేరంటానికి పిలవడానికి బయలుదేరుచుండగా పట్టుచీర జ్ఞాపకమునకు వచ్చింది. తిరిగి లోపలికివెళ్లింది. పెట్టె తీసి చీర బయటకు కాగితంమడతలోనుంచి తీసింది. ప్రక్కనేయున్న అద్దముదగ్గరకుపోయి ఆచీరనింకోక మూరు భుజముమీద పమిటలాగ వేసుకుంది చాలా బాగుంది. విడిచిపెట్టలేకపోయింది. "ఎంతఅందంగా వున్నానో" అని అద్దంచూసుకుని మురిసిపోయింది.

ఏదో ఆలోచనతోచింది ముఖం వికసించింది. సంతోషములో వళ్లు పరవశమైపోయింది. దబుక్కున తనకు తెలియకుండానే కట్టుకున్నచీర విప్పివేసి పట్టుచీర మడతవిప్పి కట్టుకొంది. మడతవిప్పుతున్నప్పుడైనా తనుచేస్తున్నది గ్రహించుకోలేదు.

ఆసలే మేలిమివంటి శరీరచ్ఛాయ. దానికితోడు కనకాంబరం రంగుచీర ఆమె ఛాయలో మిళితమై పోయి ఆమెసౌందర్యమును ద్విగుణీకృతంచేస్తోంది. కుంకుమభరిణ చేతబుచ్చుకుని, లక్ష్మిని చంకనెత్తుకుని వీధిపైకువచ్చినది. తనచీరను విసుగులేకుండా యెన్నోసార్లుచూసుకుంది. కాని పాపం ఆసంతోషం అక్కడితో అంతరించింది. చీరతీసుకొనివెళ్లి నాలుగు రోజులైంది. పుచ్చుకున్నది, లేనిది తెలియలేదు యే సంగతీచెప్పమంటూ గోపయ్యశెట్టిగుమాస్తావచ్చి అడిగినాడు.

అక్కడితో నవనాళ్లూకృంగిపోయి ముఖముయెఱ్ఱబారి గుండెల్లోరాయిపడ్డట్లైంది. సీతకు యేడుపుదాకా వచ్చింది. తనుచేసినపని చటుక్కున గ్రహించుకుంది. కట్టుకున్నది షాపువాళ్లుపుచ్చుకోరు. యింకా డబ్బివ్వలేదు. ఎవరిదోసొమ్ము దొంగలించినట్లయింది. ఏమీతోచలేదు.

గుమాస్తాకు యేదో జవాబుచెప్పిపంపి లోపలకు వచ్చి మంచంమీదపడుకుని యేడవడంప్రారంభించింది. పాపము లక్ష్మికి బోధపడక బిక్కమొగముతో తల్లిని చూస్తోంది.

తనకే పండుగపూట కళ్లనీళ్లుపెట్టుకుని, అపశకునముగా పడుకునియుండుట తప్పగాతోచిందికాబోలు, కళ్లుతుడుచుకొని తిరిగి ముఖముకడిగి బొట్టుపెట్టుకుంది. పిలవడానికి యెల్లాగైతేనేం వెళ్లింది.

పిల్చినవాళ్లందరూవచ్చారు. ప్రతీవాళ్లూ ఆమె చీరనుగురించి అడిగేవాళ్లే.

"సీతమ్మా! యేమిటో! మీ తమ్ముడిపెండ్లికి ఆడబిడ్డలాంఛనానికి యిచ్చినచీర యిదేనా?" అంది ఒక వృద్ధసుమంగళి.

"ఎంతబాగుందమ్మా యీచీర, యెంతఖరీదు?" అనిప్రశ్నించింది యింకోప్లీడరుగారిభార్య.

"యిప్పుడు చూచినరకం చూడకుండావస్తోంది. మొన్న మాచెల్లెలుపెండ్లికి వాళ్లఅత్తవారుపెట్టారు. కెంపురంగు. చుట్టూ ఆయిస్క్రీముబోర్డరట. జరీది. ఎంతబాగుందనుకున్నావు రాజమ్మా" అంది మునసబుగారికూతురు సరస్వతి వాళ్లగొప్పను ప్రకటిస్తూ.

"యెక్కడకొన్నావే సీతా! యీవూళ్లోనా యెన్ని రూపాయిలు?" అంది యింకో చనువైన స్నేహితురాలు.

ఈ ప్రశ్న పరంపరలవలన ఆమె జవాబు చెప్పలేక పోయింది. యేదో అందరూ వచ్చారు, వాళ్లకుతగిన మర్యాదచేసి సరదాగా గడుపుదామనుకుంటే యీ చీర సంగతికటే గుండెల్లో రాయిపడ్డట్టుండుటవలన గుట్టుగా యెవరికితగ్గ జవాబులు వాళ్లకియ్యిస్తూ అందరినీ ఫలతాంబూలాదులతో సాగనంపింది.

అందరూ వెళ్లిపోగానే చీకటిపడుతోందని వంట ప్రయత్నంలో తనుండగా నారాయణమూర్తి చేతిలో ఒకప్యాకట్టుపట్టుకుని సీతా! సీతా! అంటూవస్తాడు. సీతనుచూచి "పాపం ప్రొద్దున్నల్లా మరచిపోయాను పండుగకు నీకు క్రొత్తచీరతీసికోవాలని. ఇప్పుడే జ్ఞాపకంవచ్చి త్వరగా బజారుకువెళ్లి తీసుకువచ్చాను చూడు." అంటూ ఆప్యాకెట్టు చేతికందిచ్చాడు. సీతకు నోటమాటరాలేదు. మాటలు తడబడ్డాయి. ముచ్చెమటలుపోశాయి.

"ఏమిటట్లా ఖంగారుపడుతావు" అన్నాడు భర్త. జవాబుచెప్పకుండా గదిలోకి చరాచరా వెళ్లిపోయింది. వెనకాలే అతనూ వెళ్లాడు. దండెంమీద కుచ్చిళ్లుపెట్టి పెట్టిన క్రొత్తపట్టుచీర కనిపించింది. ఇదెక్కడిది దన్నాడు.

ఎట్లాగైతేనేం ఒకటితరువాత ఒకటివరుసగా జరిగినదంతా చెప్పింది. తప్పుక్షమించమంది. విచారించింది. తెలివితక్కువగా ప్రవర్తించానని వప్పుకుంది. నారాయణమూర్తికి యేమిచెప్పటకుగాని, చేయుటకు గాని తోచలేదు. ఒకటికాదు, రెండుకాదు పాతిక రూపాయిలు! ఇప్పుడెక్కడనుంచితెస్తాడు. ఆషాపు వాళ్లు యెన్నాళ్లని మర్యాదగా వూరుకుంటారు. భార్యమీద పట్టరానికోపమువచ్చింది. కాని, ఆమె ప్రార్థనలకు లక్కకరిగిపోయినట్లు కరిగిపోయాడు.

"సరే నెలజీతంఅంతా రాగానే యింటిఖర్చుకై నీచేతులోనే పెట్టుతున్నాను కాదా? నాకు కావలసినవి రేనాలుగో అయితే వుంచుకుని. నీవే ఆలోచించు యేవిధముగా కూడబెట్టి యెప్పటికియిస్తావో యీ మొత్తంఅంతా."

సీత జవాబుచెప్పలేదు.

పాపమా దంపతులకు పండుగంతా బాగాగడిచి చివరకు యిట్లు వ్యాకులతచెంది యిద్దరు విచారిస్తున్నారు.

"తలుపు, తలుపు" అంటూ మాటలు, చప్పుడు ఒక్కమారు వినిపించాయి. యిద్దరూ, విచారము, చింతతో మైమరచియుండగా యులిక్కిపడిలేచారు.

"ఎవ"రంటూ సీతవెళ్లి తలుపుతీసింది. పోస్టు బంట్రోతు ప్రత్యక్షమైనాడు. వేళకానప్పుడు యిప్పుడేమిటివచ్చిందాని అనుకోమనుండగానే, వాడు కొన్ని రూపాయలనోట్లు, యింకా ఒకటెలిగ్రాం మనియార్డరుకాగితము అందివ్వబోయాడు. ఇంతలో నారాయణమూర్తికూడా అక్కడికివచ్చాడు. ఏమో కొట్టుతాలూకువని సీత లోపలికివచ్చేసింది.

వికసించినముఖంతో నారాయణమూర్తి లోపలికి వచ్చాడు.

"మీ మేనమామగారి దగ్గరనుంచి పండుగబహుమానముగా నిన్ను పిల్లను బట్టలుకొనుక్కోమని ముప్పై రూపాయిలు వచ్చాయి" అన్నాడు భారము తగ్గిన హృదయముతో.


SASTRY'S HOTEL & RESTAURANT

# లిల్లీ

విద్వాన్ విశ్వనాథసరసింహముగారు బి.ఏ. బి.యిడి.

స్కాట్లాండు ప్రధానపట్నమైన ఎడింబరో నగరంలోని రాజవీధి కన్నుల కింపుగా వుంది. పాశ్చాత్యనాగరికత పెచ్చుపెరిఁగి వున్నది. విశాలమైన భవనాలు. లెక్కకు మిక్కిలి జనసంఘాలు రాకపోకలు చేస్తున్నారు.

నాటిసాయంకాలం మిక్కిలి తొందరగా నడుస్తూవున్న జనసమ్మర్దంలో ఎవరున్నా లెక్కసేయకుండావున్నది లిల్లీని మాత్రం. లిల్లీకన్యకు పన్నెండు వర్షముల వయస్సు. పల్చని శరీరం. అవయవములన్నీ తీరుగా దిద్దినట్లున్నాయి. జీర్ణవస్త్రములే ఆమె కమూల్యాభరణాలు. తలపై నుంచుకోడానికి టోపీ లేదుగాని పాతగిల్లి కన్నములతో నిండిన బూట్సుమాత్రం ఆమె తొడుక్కొన్నది. ఆ బూట్సునా లేనట్లే కాఁబట్టి మార్గంలోని కఠినప్రదేశములు, ఆమె లేతవేళ్లనిండా పారాణీపూఁత పాత వడినట్లు, నెత్తురు గూడుకట్టేలాగు చేసినాయి. అయినా ఆమె కాదృష్టి రవంతా లేదు.

ఎందుచేతంటే బాగా చీఁకటిపడక ముందే అంగడిలో అగ్గిపుల్లలమ్మి కొన్ని పెన్నీలు సేకరించవలసివుంది. ఆ స్వల్ప మూల్యంతో లిల్లీకన్య రాత్రి భోజనం కొఱకు రొట్టె కొనుక్కోవాలి. తానేకాక చిన్నితమ్ముడొకడు తనకోసం ఎదురు చూస్తూవుంటాడు. వారిద్దరికిన్నీ ప్రపంచంలో మరెవ్వరున్నూ నాఅన్నవాళ్లు లేరు. వారే ఒకరికొకరు సాయం. ఇంకో సాయం సర్వసాక్షియైన పరాత్పరుడే.

అయితే సూర్యభగవానుడు ఆతశీకాలపు సాయంకాలం చరచరా అస్తాద్రికి పాకుచున్నాడు. కష్టజీవుల కన్నీళ్లకైనా కనికారం లే దాతనికి. డిసంబరునెల ఆఖరు దినం. పాశ్చాత్యదేశాల్లో అతిశీతలంగా వుంటుంది. మంచు వర్షంగా కురుస్తుంది. సాయంకాల మయ్యాక సాధారణమైన వాళ్లెవరూ బైటకురాలేరు. ఓవేళ బైటపడ్డ వారు తిరిగీ ఇల్లు చేరుకుంటారా అంటే దైవాధీనం.

లిల్లీ మాత్రం తొందర తొందరగా నడుస్తోంది. అగ్గిపుల్ల లగ్గిపుల్లలని కనుపించిన వాళ్లందర్నీ అడుగుతోంది. కాని ఏం పాపమో కాని ఓకళ్లేనా ఆమెదగ్గిర ఓపెన్నీ అగ్గిపుల్లలేనా కొన్నపున్నెం కట్టుకోలేదు. సరిగదా ఆమెవంక కన్నెత్తిచూచినవాళ్లేనా ఆమహాజనసంఘాల్లో లేరని చెప్పాలి. ఎవరిపన్లమీఁద వారే చరచరా పోతున్నారు.

లోకబాంధవుడు లోకాన్ని వదిలేసి ఏకారణంచేతోగాని ఒక్కసారిగా పడమటి కొండలో యట్లోపడిపోయాడు. అంతకు ముందుగానే మంచుకురియటం ఆరంభించింది. లిల్లీ పాపం శక్తివంచనలేకుండా లేని సత్తువ తెచ్చుకొని 'అగ్గిపుల్ల లగ్గిపుల్ల'లని

అమ్ముతూంది. ఆమె కేకలు విన్నవాళ్లు లేరు. విన్నా సరకుచేసినవాళ్లసలే లేరు.

మంచుకురుస్తూంటే మఱింత చీకట్లు క్రమ్ముతూన్న సమయంలో లిల్లీకన్య చినిగిపోయిన చేగుడ్డ తలక్కట్టుకున్నాది. చేతిలో అగ్గిపుల్లలు. వచ్చీ పొయ్యేవారివంక దృష్టి. అగ్గిపుల్లలమ్ముదామనే ఆపేక్ష. కేకలు వేసివేసి ఆమెగొంతు వెలుగు రాసిపోయింది. చీకట్లధికమవుతున్నాయి. ఇంక అగ్గిపుల్లలు కొనేవాళ్లెవరూ లేరు గదా ఇంటికి పోదామనుకుంది లిల్లీ. రాత్రికి రొట్టెలేదనే నిరుత్సాహం తానేకాక తమ్ముడుకూడా వస్తుకదా అనే విచారం మఱింత బాధకలిగించిందామెకు. అయితే ఏంచేస్తుంది, ఏంచేయగలదు. ఎల్లాగేనా ఇల్లు చేరుకుందామనే వాంఛ కలిగిందా పసిదానికి. ఇంటిదారిపట్టింది.

మంచువానచేత ఆమె ధరించిన పాతలు కూడా శుభ్రంగా తడిసిపోయాయి. ఇంకా మంచు కురియటం మానలేదు సరికదా హెచ్చవుతోంది. అల్లాంటి సమయంలో బయటుండిపోతే పర్యసానం ఏంకావాలో పాపం లిల్లీకన్యకు తెలియని విషయంకాదు.

కాళ్లసత్తువ గొద్దీ దగ్గిరత్రోవతీసి చరచరా ఇంటివేపు నడుస్తోందామె. ఇంత నడచినా త్రోవ తరిగినట్లు కనబడటంలేదు. ఆఖరి కో సందులో ఓ పెద్దమేడదగ్గిర ఆగిందామె. ఆగడమేంటి. కాళ్లబలిమి అంతకన్న ఓఅడుగేనా ఆమెని వేయనీలేదు. ఇచ్చమాత్రం పరుగెడుతోంది.

ఓ చెట్టుక్రింద దివ్యమైన భవనాని కెదురుగా ఆమె కొంచెంసేపు అలసట తీర్చుకుందామని అనుకుంది. ఆపాళంగానే చతికిలబడింది. ఎట్టయెదుట కళ్లు మిరుమిట్లు గొల్పే దీపాలతో వెలుగుతూంది దివ్యభవనం. క్రిస్మసు ఆఖరిదినం కాబట్టి మఱింత ప్రకాశమానంగావుంది. అయితే తలుపులన్నీ మూయబడుతున్నాయి. అద్దాలకిటికీల్లోంచి అంతా స్పష్టంగా లిల్లీ కళ్లకు అగుపిస్తోంది. అందులో పెద్ద హాలులో కుర్చీలు బల్లలు అన్నీ విస్తారంగా వున్నాయి. స్వచ్ఛమైన బట్టలు పరచిన బల్లలమీద పళ్లెరాలు. వాటిలో రంగు రంగుల ఫలాహారపు సామగ్రి. సువాసన లిల్లీకన్య కూచున్నదాపున కొడుతోంది. నవయౌవనంలోవున్న స్త్రీ పురుషులందరూ ఒకరితో ఒకరు సల్లాపాలాడుకుంటూ విందు కుడుస్తూన్నారు కేకలు వగైరా తినుబండారాలు తినడమయ్యాక బ్రాందీ మొదలైన పానీయాలను స్వేచ్ఛగా సేవిస్తున్నారు. తర్వాత ధూమపానం. లిల్లీ విప్పారినకళ్లతోటి చూస్తోంది పాపం.

ఆమె శరీరమంతా కొయ్యబారినట్లు అయింది. ఇంటికిపోలేనని నిర్ధారించుకుంది. ఓ అగ్గిపుల్ల వెలిగించి చలికాచుకుందామనుక్కుని చర్రుమని వెలిగించింది. కొంకర్లుపోయిన ఆమె ఆ లేతవేళ్లసందున ఎఱ్ఱని వెలుగు నులివెచ్చగావుంది. ఆ వెల్తురులో క్రీడలాగ కనుపించింది. తనకోసరం తమ్ముడు వెతుక్కుంటూ వస్తూన్నట్లు పొడకట్టింది. ఒక్కసారి ఆమె కష్టమంతా మటు

మాయమైపోయింది. అయితే క్షణికం అల్లావుండగానే అగ్గిపుల్ల ఆగిపోయింది. మళ్లీ యథాప్రకారంగావుంది లిల్లీకన్య. అంతా చీకటయింది. కొంచెం సేపయ్యాక వుండలేక మరో అగ్గిపుల్ల వెలిగించిందామె. ఆపుల్ల వెలుంగులో ఎదురుగా వున్న భవనం అందులోని ఫలాహారాలు, కర్కశహృదయులైన స్త్రీపురుషుల వినోదాట్టహాసాలు స్పష్టంగా గోచరించాయి. పెదవు లామె విప్పిందికాని నోట తడిలేదు. కొరడువారిన వేళ్లు కొంచెం వెచ్చగిల్లేసరికి అగ్గిపుల్లకి అవసానం తటస్థించింది.

ఆ వెలుగులోనే పాప మాబాల మరో పుల్ల వెలిగించింది. ఆవెల్తురు పోకుండానే చేతిలోని పుల్లలన్నీ వెలిగించీసింది. భగ్గున పెద్దవెలుగయింది. అందులో లిల్లీ దివ్యమయిన చిత్రం చూచింది. చనిపోయిన జనయిత్రి స్వర్గలోకంలో హాయిగావుంది. కనికరంగల హృదయంతో కన్నీరుజారుతూండగా చాచిన రెండు చేతుల్తో తన్ను రమ్మని ఆహ్వానిస్తోంది. అచట విచారమేమీ లేదు. అంతా సుఖమయం. అందరూ నవ్వుతూ దయార్ద్రహృదయులైన స్త్రీపురుషులు. ఎంతోసేపు ఆ దృశ్యంవుండదని లిల్లీ తల్లిని కావలించుకుందామనిలేచింది. రెండు చేతులూచాచి 'అమ్మా! అమ్మా!' అంది బిగ్గరగా. ఎదుటనే దివ్యభవనంలో స్త్రీపురుషులంతా వినోదంగా కిచకిచలాడుతున్నారు.

---

## నేను

చెరుకూరి సూర్యనారాయణమూర్తిగారు

బాలచంద్రామల ప్రభాజాలకలిత
సుందరతరంగ మాలికాశోభితాంబు
జాశయంబున కమనీయజలజడోలి
కాంతర మృదుపరాంగశయ్యను బరుండి
మందమలయానిలార్భక బృందమూప
కులుకుచుండెడు తుమ్మెదకొదుమకంటె
అతులహర్షాశ్రుజల పులకితుడ నేను.

* * *

లలితవికసిత కుసుమవల్లరుల నెల్ల
కొల్లగొట్టుసుగంధ౦బు జల్లుకొనుచు
భూరిసౌధాగ్రభాగమ్ము పులినతలము
పచ్చికబయళ్లు తమకాటపట్లుగాగ
శీకరవితానమందందు సేకరించి
ప్రేమపాత్రులకొకయింత బిచ్చమిడుచు
మలయగిరిసాను నిర్గతానిలకుమార
వారములకంటె స్వేచ్ఛావిహారి నేను.

కలతదొలగించి మోదమ్ముజిలుకరింప
చిత్తసీమలభావముల్ చిగురులెత్త
లేతజివురులజొంపంపు మేతమేసవి
కొపరిపాడెడు కోకిలకులముకంటె
వినుటకుపసందు నానందమునకుమందు
తేనెలనుజిందు సుఖముల తెరవుపొందు
కోమలస్వరముల బాడుకొందు నేను.

* * *

కాలచక్రంపు టొత్తిడిపాలుగాక
కనుచు చిత్రాల జగతియుగాలకొలది
విధివిరామములేక విస్వేధినొదిగి
కేరలిపడుచును మిలమిల మెరయుచుండు
రిక్కగమిలోని చక్కనిచుక్కకంటె
కథుకులాలికించి యలరింపగలను నేను.

# ప్రబోధ సుధాకరము

శ్లో॥ దయాప్రపూర్ణం ప్రణవైకసారం
విశాలనేత్రం మహిమాభిరామం
శ్రీరామభక్తం శ్రితపారిజాతం
నమామికృష్ణం గురుదేవమూర్తిమ్॥

ఓ యాదవాధీశా! శ్రీకృష్ణా!

నీవు సర్వసమర్థుండవు. పుట్టుక లేనివాడవు. నరతిర్యగమర శరీరంబులను పురంబులుగాఁజేసి యందుఁదారతమ్యరూపంబున నీవు నివసించుటం జేసి పురుషుండన బఱంగెదవు. పురుషులలోనెల్ల నుత్తముఁడవై పురుషోత్తమ విఖ్యాతివహించితివి. సదాత్మకుడవై నిలకడగాంచితివి. చిదాత్మకుడవై సర్వము నెఱింగెదవు. నవరసభరితంబుగా జగంబు సృజించి సర్వరసంబుల నానందంబు నలయింపఁజేసి నిత్యానందస్వరూపుడవై యుండెదవు. దీపములకు, హుతాశనునకు చంద్రసూర్యులకు తేజము కల్పింపజాలు స్వయంజ్యోతివి. అట్టి గోవిందునకు నమస్కారము. శ్రీకృష్ణుని గురుదేవుని మూర్తిగాభజించు శంకర భగవత్పాదాచార్యులవారు వ్యంగ్యముగా యాదవాధీశుని స్మరించు మిషమున గురుస్మరణమొనర్చినారు.

దేవా! నిన్ను వర్ణించుటకు వేదములే చాలక మూగవానివలె మౌనము దాల్చుచున్నది. అపౌరుషేయములగు వేదములే యట్లయిన సామాన్యులమైన మానవులము మావాక్కులకెట్లు నీవు గోచరుడవగుదువు?

అట్టులయ్యు వేదాంతశాస్త్రసారములను గ్రహించి జింతించి కీర్తించి బహువిధాభ్యాసంబులొనరించి నిన్ను బొగడుటకు బ్రయత్నించుచుందుము.

ఉపాసనలెన్ని జేసిన జ్ఞానభక్తియోగంబులు సాధించిన నింకనెన్నేని యుపాయములాశ్రయించి కష్టించినను, వైరాగ్యంబులేనివానికి మోక్షాధికారం కలుగనే కలుగదు.

ముక్తి సాధనంబులు మూడు. వైరాగ్యము, ఆత్మబోధము, భక్తి. ఈమూటిలో మొదటిది విరాగము— విరాగమనగా వితృష్ణత అనగా నాసలేమియే.

## శ్రీమతి కాళ్లకూరి మహాలక్ష్మీసుందరిగారు

అయ్యాశాస్వరూప మెఱుంగుటయే దుర్ఘటంబు. దానింజయించు మాటలేల? సర్వదేహములయందు నహంతగా మమతగా నాతృష్ణదాగియున్నది. జంతువులయ్యహంత తమదేహమందును, మమత భార్యమొదలగు విషయములయందు దాల్చియున్నవి.

ఇంతగా సకలదేహములయందును దాగియున్న యీ యహంతామమతలను బాఱదోలుట యెట్లన్నచో వినుండు.

"ఈతను వేమిటంబోదము? దీని స్వరూపమేమి? విషయములతో నీ శరీరమునకేమి సంబంధము? అని సాధుసన్నిధిలో శాస్త్రాభ్యాసముచే విచారణచేసిన యెడల నీయహంతామమతలు నివర్తించును.

అహంతయనగా నేననుకొనుట. నేనింతవాడను, నాకుమించిన వాడెవడు? సర్వసమర్థుడను నహంభావము.

మమతయనగా నాదియనుకొనుట నాభార్య, నాబిడ్డలు, నాబంధువులు, నాయిల్లు ఇట్లు తనదనియనుకొన్న వానియందొక యభిమానము కలిగించుకొనుట.

ఈదేహంబెట్లు కలిగెననగా—

స్త్రీపురుషుల సంయోగముచే శుక్రశోణితముల మిశ్రమముకాగా నారెంటివలన నేర్పడిన బిందువులో కర్మవశుడగు జీవుండు చల్లగాఁబ్రవేశించి దేహధారి యగుచున్నాడు.

ఇట్లు శరీరముదాల్చిన జంతువు కఫముతో మూత్రముతో పురీషముతో నిండియున్న తల్లి గర్భమను గుంటలోబడి తొమ్మిదిమాసములు జఠరాగ్నిచే సంతతము క్రాగుచుండును.

దైవయోగముచే ప్రసూతి సమయమునకుఁ బిండం బడ్డంబుగాదిరిగి సుఖప్రసవము కానియెడల శస్త్రములచే ఖండించి బలాత్కారముగా బయటికిలాగబడును.

అట్లుగాక సవ్యముగా ప్రబలమగు ప్రసూతివాతములచే మాతృద్వారమునుండి పిండము వెలికివచ్చినను, తత్కాలమందలి వేదన చెప్పతరమా?

ఇంతకష్టపడి తల్లికడుపు వెడలివచ్చిన జీవునకు పుట్టినవెనుకైన నేమైన సుఖముకలదా? ఎన్నిఘోరములు! ఎన్నిరోగములు! ఎన్నిగండములు!

తనవారి నెడబాసియు, తరుగని దారిద్ర్యమనుభవించియు, తప్పకోనజాలని యాపదలబొందియు ననుభవించు మనోవ్యధ యింతని వర్ణింపశక్యమా?

పుట్టుచుగిట్టు నీ జీవుడు నరుడై పశువై పక్షియై పురుగై యెనుబదినాలుగులక్షల యోనులందు కర్మనిబద్ధుండై పరిభ్రమించుచు యాతన ననుభవించుచున్నాడు.

జననమరణ ప్రవాహమునంబడి యెట్టకేల కీజీవుఁడు బుట్టి స్వకులాచారవిచారపరుఁడై వేదప్రచారపరుండై యుండియు, పండితుండైయుండియు నాత్మానాత్మవివేకంబెఱుగక, దేహమునశించునదేయని తెలియఁజాలక కామాదులలోబడి యాయువునువ్యర్థ మొనరించుచున్నాడు.

ఇంక నీయాయువు నెట్టిదనగా, గడిచిపోయిన క్షణములో నొక్కలవమాత్రమేని లక్షలధనముపోసిన నెక్కడనుండియేని కొనితేరానిది. ఆయు వేపోయిన నంతయుబోయినదేయగును. అంతకంటె హానియున్నదున్నదా?

ఇట్లాయుక్షయంబొనరించుకొన్న జీవుకు భ్రాంతులంజిక్కి "భ్రాంతియాహా వైకుంఠపాళియాడుఁ బెద్దపాముపోతె" యని జీవయాత్రలో వ్రాసినట్లు పతితుడై పశ్వాదిదేహములందాల్చి తనశరీరమే తానెఱుంగని స్థితిలోనుండుతరుణమునఁ బరమార్థమును మాటయెక్కడిది?

రామ! రామ! ఆకలితో బక్కజిక్కి యెండతెగక బరువులు మోయుచుండు నీయెద్దులు, దున్నలు, గుఱ్ఱములు, గాడిదలుపడు కష్టము వర్ణింపవశము కాదు.

రసము,రక్తము,మాంసము,కొవ్వు,మజ్జ యెముకలు, శుక్రములను సప్తధాతువులును, వాత పిత్త శ్లేష్మంబులనియెడు త్రిదోషంబులును జేరియైనదీ దేహము. పైనఁ జర్మముతోఁ గప్పబడిన కారణమునఁ గాకులచే భక్షింపఁబడకయుండు.

తనముక్కున నోటవెడలు కఫంబుఁజూచియు, నపానమార్గంబుల వెలువడు మలమూత్రంబులఁ జూచియుఁ దానే యసహ్యపడు జీవుఁడు తనలో నిండియున్న పదార్థం బెఱుంగడుకదా!

దారిలోబడియున్న యెముకనుజూచి తనకెక్కడ యంటునోయని యులికిపడి భయపడి తొలగిపోవు జీవుడు తనతనువంతయు నీ బొమికలతోఁ జేయఁబడిన బొమ్మయేయని జూడలేడు.

శిరస్సు మొదలు చిటికెనవ్రేలువఱకు లోనదుర్గంధపరిపూర్ణమగు నీమేనిపై నజ్ఞుండు చందనాగరు కర్పూరంబులంబూసికొని స్వాభావికంబులగు దోషంబులం గట్టిపుచ్చుచుఁ బై మెఱుంగుల గుణంబులకుఁ జెలంగుచున్నాడు.

ఈ కాయమునందుఁ దగిలిన గాయమును మూడు దినములుమాత్రము కడుగక కట్టకవిడిచితేని యది పుచ్చి పురుగులుపడి గబ్బుకొట్టును.

హంసతూలికాతల్పములపై పూలపాన్పులపై పవళించి నిద్రించిన సుకుమారశరీరమే వెదుళ్లతో తాళ్లతో కట్టి తీసికొనిపోయి కట్టెలలో కాల్చివేయబడును.

సింహాసనోపవిష్టుండై యుండునపు డెవనిజూచి లోకము ముదమొందెనో యా మహారాజాధిరాజు కాలప్రేరితుడై కొంపోవంబడునపుడు చేయదగినదిలేక కన్నులప్పగించి చూచుచుండవలసినదేకదా!

ఇట్టి యతిమలినమైన క్షణభంగురమైనదేహ మెవని సత్తవచేత చేతనముదాల్చి చలించుచున్నదో యా పరమేశునిమఱచి జీవుడే యనిత్యమగుదేహమునందే నేనను నహంతను కలిగించుకొనుచున్నాడు.

సచ్చిదాత్మకమైన యాత్మయెక్కడ? మాంసరుధిరాస్థినిర్మితమైన దేహమెక్కడ? యని విచారించి యే బుద్ధిమంతుడు తనశరీరముపై నభిమానముంచుటకే సిగ్గుపడునో యాతడెట్లు లితరవస్తువులపై మమకారముంచును?

ఇంతతో దేహనిందాప్రకరణమైనది. ఇక విషయనిందాప్రకరణము వివరింపబడును.

# నాట్యాభినయములు

సత్యవోలు శ్రీరామమూర్తిగారు

సకలజన సమాదరణీయంబై హృదయానందకరంబై భుక్తిముక్తిదాయకంబై వెలయు నాట్యాభినయములు భారత భూమిని చిరకాలమునుండి నాదరింపబడుచున్నవి. ఋగ్వేదమునుండి వాద్యమును, యజుర్వేదమునుండి యభినయమును, సామవేదమునుండి గానమును, అధర్వవేదమునుండి రసమును సముపార్జించి యార్యులు సంగీత నాట్యాభినయ శాస్త్రములను లోకమున వెలయించినట్లు భారతార్ణవాది గ్రంథములు చాటుచున్నవి. మఱియు నందికేశ్వరుడు, దత్తిలుడు, కోహళుడు యాజ్ఞవల్క్యుడు మున్నగువారనేకులు నాట్యాభినయ శాస్త్రములను తఱచి లోకమునకనుకూలమగు మార్గములు ప్రతిష్ఠించిరి. అందు మన యాంధ్రదేశమున నందికేశ్వర ప్రోక్తమగు నభినయదర్పణము, భరతరసప్రకరణము మున్నగు గ్రంథములు సామాన్యులచే నాదరింపబడుచున్నవి. నాట్యశాస్త్రము, భరతార్ణవము మున్నగు నుద్గ్రంథములు మాత్ర మాలంకారికులచే నాదరింపబడుచున్నవి.

ప్రకృత మీ శాస్త్రము లోకమున వెలయుటవలన ప్రజలకు గలుగు లాభమేమి? జనుల కెట్లవసరము? అను విషయములు గ్రహించుట ముఖ్యము. పూర్వము లాక్షణికులు, సాహిత్యచక్రవర్తులు, శబ్ద శాస్త్రవేత్తలు మున్నగువారనేకు లీ శాస్త్రములను సమాదరించి వెలయించిరి. ఈకాలమున సామాన్యజనులు మాత్ర మీ శాస్త్రములను విలాసవిద్యగ నభ్యసించుచున్నారు.

పూర్వికులు నేటివారివలె నీ శాస్త్రములను విలాసవిద్యగ పరిగణింపక సృష్టిరహస్యము నెఱింగించుటకే విద్యప్రధానముగ నభ్యసించుచుండెడివారు. మనసుననున్న భావములను మృదువుగ వ్యక్తముచేయుట కుద్దేశింపబడినది యభినయ శాస్త్రమనియు, కరచరణాద్యవయవములచేతను, గానముచేతను, విభావమును వ్యక్తముచేయునది నాట్యశాస్త్రమనియు నెంచి నాటివారీ రెంటిని పరిచారికాది లోకము మొదలు పండితలోకమువరకు వెలయించి పోషించిరి. అందు ముఖ్యముగ నీ శాస్త్రములు రెండును స్త్రీలు మృదువుగ భావవ్యక్తి చేయుటకును, శరీర వ్యాయామాదిక్రీడలకును నుద్దేశింపబడినట్లు వాని సాంప్రదాయములవలన మనము గ్రహించుట కవకాశమున్నది. నాట్యశాస్త్రము నృత్యము, నృత్తము, నాట్యము నని మూడు తెఱగుల విభజింపబడినది. నృత్యమనగా తాళ లయానుగుణ్యమై రస భావములతో గూడినది. నృత్తమనగా రస భావములచే తక్కువపడినదై తాళలయానుగుణ్యముగా నుండునది. నాట్యమనగా నాటకములందు పూర్వకథతో ననుసరించి వినియోగింపబడునది. ఈ నృత్య నృత్త నాట్యములు మూడును లాస్యమనియు,

తాండవమనియు రెండువిధముల వెలయుచున్నవి. లాస్యమున రాగతాళములతో గూడి రసభావములను కూర్చుండి యభినయించి చూపునది. తాండవమనగా తాళలయానుగుణ్యముగ నిలిచి యభినయించి చూపునది. మఱియు, నాయికానాయక భావములు సాత్త్వికసంచారాదిభావములు, నాయా రసములననుసరించి యీ రెండు శాస్త్రములందును ప్రయుక్తమగుచుండును. ఇది భరతశాస్త్ర సాంప్రదాయము.

అభినయశాస్త్రము మనసునందలి భావమును కరచరణాద్యవయవములచేతను, చూపులు, కనుబొమలు, హస్తభేదములు మున్నగువానిచేతను వ్యక్తముచేయు మార్గములను తెలుపును. మనసునం దుదయించు కోర్కెకు భావమనియు, నా కోర్కెను కరచరణాద్యవయవములచేతను, చేష్టల చేతను దెలుపుట విభావమనియు, నూపురాద్యలంకారములచేతను, నుదాహరణ వస్తువులచేతను వ్యక్తముచేయుట అనుభావమనియు నీ శాస్త్రసాంప్రదాయములో ముఖ్యమైన భేదము. విభావాదులాలంబనోద్దీపనాదిభేదములతో నుండును. సాత్త్విక సంచారాదిభావము లీ రెంటికిని సమానములై యున్నవి. ఈ యభినయశాస్త్రము సృష్టిలో సకలపదార్థములు సంజ్ఞారూపమున నొండొరులు తెలుపుకొనుట కుద్దేశింపబడినది.

ఈ రెండు శాస్త్రములు లోకమున వెలయుటవలన ననేక లాభములున్నవి. అందు నాట్యశాస్త్రము ముఖ్యముగ స్త్రీలకు వ్యాయామక్రీడార్థ ముపయుక్తమయి ఆరోగ్యవతులుగ జేయును. కావుననే తొల్లి యంతఃపురస్త్రీలుకూడ నాట్యశాస్త్ర మభ్యసించుచుండెడివారు. అభినయశాస్త్రము లలితముగ భావమును వ్యక్తము చేయుట యటుండ పరస్పరభేదముగల భాషలు మాటలాడు మనుజులు కలిసికొనినపుడు వారివారి భావములను సంజ్ఞలచే దెలుపుకొన్నుట కుపయుక్తముగనుండును. అట్లు దెలుపుకొనువారి ననేకులను మనము జూచుచునేయున్నాము. అంతియగాక మన మొకరితో మాట్లాడునపుడు భావముల ననుసరించి మనకు దెలియకనే నభినయించుట సహజము. కావ్యములను రచించువా రీ రెండు శాస్త్రములను నేర్చియుందురు. వాచ్యాభినయము కావ్యముల నిమిత్త ముద్దేశింపబడినది. రసమును దెలుపునవియు, భావమును వ్యక్తముచేయునవియు, సద్వృత్తమును బోధించునవియు నగు నీ శాస్త్రములు లోకమున మిక్కిలి యుపయుక్తములని వేరుగ చెప్పనక్కఱ లేదు.

ప్రకృతము నాటకములందును సినిమాలయందును పాత్రధారు లీశాస్త్రముల సామాన్యసాంప్రదాయములైన నెఱుంగనివారనేకు లున్నారనుటకు సందియము లేదు. నాటకములందు కాలానుగుణ్యముగ భావమును వ్యక్తముచేయుచు నభినయించుటే ముఖ్యముగాన శాస్త్రసాంప్రదాయము లించుకేనియు తెలియని నటీనటకులవలన చాలభాగము నాటకములును సినిమాలును తృప్తికరముగాలేకుండుటకు కారణమగుచున్నది.

# కవిహృదయము

గడచిన జూలై మాసపు గృహలక్ష్మియందుఁ బ్రక టింపబడిన "విద్వాన్ కవితిలక కవితావిశారద కాంచనపల్లి కనకాంబగారు" అను వ్యాసముద్రణ మున 363-వ పుటలో జీవయాత్రయందలి ౨-౫౧౦ పద్యమగు

తలగొరుగుట జలజాక్షుల
విడిపించుట భావ్యశాంతివిధియు నిషేధం
బులు లేమియు బుధదూషణ
ములు చిత్రము ముక్తబంధనులు కలిగెన్.

అనుదానిపై నిటుల వ్యాఖ్యానింపబడియున్నది:—

"ఈపద్యభావము పూర్తిగ నామెగారివలన దెలియ వలసినదే. 'తలగొరుగుట' క్రాపు చేయుటయా (cropping the hair) లేక 'జలజాక్షుల' అను విశేష్య పదమునకు సింహావలోకనముగ 'తలగొరుగుట'తోను 'విడిపించుట'తోను అన్వయము చేయదగునా. వైధవ్యవిషయమున స్త్రీలకు మౌండ్య మొక మహా క్రూరసంస్కారమని భావము కలిగియుండును.

ఈ పద్యమునందలి "ముక్తబంధములు" ముక్త పదగ్రస్తాదులు బంధకవిత్వములులోనగు కవిత్వవిషయ కములా లేక స్త్రీపురుషు లొకరినొకరు విడనాడి తిరుగ కలియుటయా? ఇందతిమాత్ర ప్రసంగమున్న వశ్యవచస్కురాలగు నీ కవితల్లజ క్షమించుగాక. ల—డ ప్రాస మిందొక ఛందో విశేషముగూడ గన్పడుచున్నది."

పైవివరణ పద్యమునుగూర్చిన కవిహృదయమునకు భిన్నమయినటుల యీవల తెలియవచ్చి వారి యభి ప్రాయమును నిట ప్రతివందనపూర్వకముగను క్షమా పణ ప్రసక్తముగను జేర్ప హేతువయినది. కవి హృదయము:—

ఇందు ముక్త యనునది రంకుటాలను నర్థమునఁ బ్రయోగింపఁబడలేదు. ముక్తబంధనము 'ముక్తులకు బంధము'. ముక్తులకు బంధమేమనగా - ఇది పరిహా సోక్తి. ముక్తులనిపించుకొనగోరు నపరిపక్వతురీ యాశ్రమస్వీకర్తలకు- ఈపద్యమున పరిపాకము నొందనివారు స్వీకరించిన సన్యాసము పరిహసింప బడినది. ఎట్లనగా:—నిక్కముగా ముక్తులగువారు అనగా ప్రకృతమున తురీయాశ్రమయోగ్యులయిన వారు:

1. తలగొరుగుట—ముండనము సహజముగా సంకోచములేక చేసికొందురు.

2. జలజాక్షుల విడిపించుట—స్త్రీజనసంఘము వారికి వదలిపోవును. వారు దానికొఱకు ప్రయత్నము చేయకయె యిది వదలిపోవునని యర్థము.

విధినిషేధములనుట—ఇదియును 'నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః' అను న్యాయమున వాస నారహితులగు పెద్దలు విధినిషేధములను దాటుదురు.

ఇక ముక్తుల మనకొనువారట్లుగాక యభిమా నము వీడకున్నను తల గొరిగించుకొనుటయు సహజ మగు నుదాసీనభావము నుపేక్షకలుగకమునుపే పట్టు దలతో స్త్రీ సంపర్కమును మానుటయు—నిద్ర పోవువానికి మానావమానములు తోచనట్లుగా—హాలా పానమత్తునకు శరీరపటమున్నదియు లేనిదియుఁ దోచ కుండునట్లుగా—విధినిషేధస్థితి రాకున్నను—అతీతుని వలె కానవచ్చుటకు విధినిషేధంబులు విడిచి భేద రహితుల మనిపించుకొనజూచు కుహనాసన్యాసుల కది బంధమేకదా. కావున ముక్తులకు సహజలక్షణ ములు కాతగినవి ముక్తబంధములయినవనుట. ఇది కవయిత్రీ హృదయము.

ఓ. వెంకటరంగయ్య

# మీ యిండ్లు
# మీరు జేయునట్టే





కొన్ని యిండ్లు మంగళకరముగాను, కొన్ని వేరుగాను నుండుటకు కాపురముజేయు స్త్రీలే కారణము. తమ పతుల
రవించుటకుగాను తగినవారి నింటికి పిలుపించు టెంతయువశ్యమని తెలివిగల స్త్రీ లెరుగుదురు. దానికి సరియైన కాలము
ీ" పుచ్చుకొనే సమయమే. శాంతినొసంగు ఇండియా "టీ" మాటలలో చమత్కార సామర్థ్యముల ప్రేరేపించును.
చి స్నేహితులు చేరెదరు. అటువంటి "టీపార్టీ" వాడుక యారంభించుము—దాని శ్రేష్టమైన ఇండియా "టీ"
ంయోగించుము.

"టీ" జేయు క్రమము: శుద్ధమైన వేడినీరు. కొంచెము వేడిచేసిన శుద్ధపాత్ర. ఒక స్పూను



"టీ" యొక్కొకరికిన్ని, మొత్తముగా నొకస్పూను యధికముగాను పాత్రములో వేసి,
బాగుగా నుడుకబెట్టిన నీటిని పోయవలెను. 5 నిముషములు తాళి, కప్పులలో పోసి,
పాలు, చక్కెర చేర్చవలెను.

## పారమార్థికమైన పానము—ఇండియా "టీ"

I K-28 RS.

# బల్గేరియా పర్వతవాసులు వారి పరిణయపద్ధతులు

ప్రపంచమును ముంచుకొనివచ్చుచున్న నవీననాగరికతాప్రవాహమున బుడుంగుమని మునకలు వేయక యే త్రేతాయుగమునాటి యాచారములనో విడువక నవలంబించుచుండు పెక్కుజాతులలో కారావాలాషి యను జాతివా రొకరు. వీరు బల్గేరియా యందలి రొడోప్ పర్వతములందు వసించుచున్నారు. వీరు పురాతన గ్రీకుదేశ సంతతికి జెందినవారు. రొమేనియను గ్రీకు భాషల సమ్మేళనమే వీరి భాష. స్థిరనివాస మేర్పరచుకొను జాతికాకున్నను వీరు సంవత్సరమంతయు కొండలమీదనే వసింతురు. ఎక్కువ చలిగానుండు దినములందుమాత్రమే నివాసముల వీడి లోయలకు వెళ్లియుండి తిరిగి పర్వతములను జేరుచుందురు. వీరికి ముఖ్యవృత్తి గొఱ్ఱెలను కాచుట. పర్వతారణ్యమధ్యమునగల బయళ్లలో వీరు గ్రామముల నిర్మించుకొనిరెదరు. ఇండ్లను కఱ్ఱలతోడనే కట్టుకొందురు. గోడ లెత్తుగనుండవు. గాలిగాని వెలుతురుగాని భగీరథప్రయత్నములతోగాని లోపల చొరజాలవు. ఎందుకన ఆయింటి కొక చిన్న ద్వారముతప్ప మరెట్టి కిటికీలుగాని తేరుమార్గములుగాని యుండవు. కాని యింటిలోపల వారికి కావలసిన సౌకర్యములుండును. బైటచూచిన యిండ్లు పాడువడిన కొంపలవలె గాన్పించినను లోపల చక్కగ నలంకరింపబడియుండును. ముఖ్యమైన గృహాలంకరణము వారి కంబళ్లే. ఇంటిలో నే మూల జూచిన నవియే గానవచ్చును. ఇతర వస్తువు లంతగనుండవు. వారు చలికాలమునందితర చోటులకు బోవుచుందురు గావున సులభముగ సునాయాసముగ గొనిపోవు వస్తువులను మాత్రమే సేకరించియుందురు.



రొడూప్ పర్వతపులోయలు పలువిధములైన వృక్షములచేతను కన్నులపండువుగనుండును. కారావాలాషియనుల కివి నివాసభూములు.

కారావాలాషియను జాతి యితర నాగరిక జాతులకంటె వివాహములను బాల్యావస్థయందే జరిపెదరు. అనగా భారతీయులవలె కేవలము చిరుతవయస్సునందుగాదు. వివాహవిషయమున వధూవరుల కెట్టి స్వాతంత్ర్యముగాని యుండదు. తల్లిదండ్రులే వివాహమును నిర్ణయింతురు. వివాహప్రయత్నములు – వధూ



కారావాలాషియనుల నివాసములు. కఱ్ఱలతో కట్టబడిన గృహములబైట స్త్రీలు పనిచేసికొనుటకు తిన్నెలుండును.

వరనిర్ణయాదులు – ప్రారంభమైననాటినుండి కల్యాణోత్సవము ముగియువఱకు వధూవరు లొకరినొకరు చూడకూడదు.

వివాహమునకు పరిసరములనుండువారంద రాహ్వానింపబడియెదరు. వారా కాలమునందంతయు యథేష్టముగ త్రాగి తందానాలు త్రొక్కి యానందింతురు. ఆ వినోదములందందరు పాల్గొననగును గాని వధువుమాత్ర మొక చీకటికోణములో కొందరు స్త్రీలమధ్య నుంచబడియుండును. ఆమె ఆకాలమందు బైటికి రాకూడదు.

వరునియింటి నలంకరించుటతో వివాహకార్యము లారంభమగును. ఆయింటిపై నొకరొజ్జనిజెండా నెగురవైతురు. అది వరునితోపాటు వివాహకార్యములన్నిటియందును పాల్గొనుచుండును. ఇంట నలంకరణము ముగిసినతరువాత వివాహమునకువచ్చిన బ్రహ్మచారిగణము ముందట వరునికి 'క్షవరోత్సవము' జరిపించెదరు. ఈలోపల వధువునుకూడ నలంకరింతురు (సాధారణముగ వధువు ఆదేగ్రామము నందో, సమీపగ్రామమునందో యేర్పాటుచేయబడి యుండును). వధువు మెడలో పెద్ద వెండిగొలుసులను వేయుదురు. వెంట్రుకలు వేరువేరుగా జడలువేసి బంగరునాణ్యములను కూర్చెదరు. తరువాత నామెకు పూర్తిగ ముసుగువేసి తల్లిదండ్రులనుండి సెలవుతీసుకొను తంతునడిపింతురు. ఇది ఘోరముగనుండును. వధువు గంటలకొలది తలిదండ్రులముందు మోకరించి పాషాణములుగరగునట్లు రోదనముచేయును.

వివాహకార్యము లారంభమైనప్పటి నుండియు సంగీతముకూడ నారంభింపబడును. ఇంటియందును బైటనుకూడ పాటలు విధివిరామము లేక పాడుచుందురు. ఆరాత్రి నడిజామున యొకచో నొక పెద్దమంటవేసి దానిచుట్టు స్త్రీపురుషులెల్లరు గుమిగూడి పాటలుబాడుచు నాట్యమాడ నారంభింతురు. దీనిని ముగించినపిదప నందరుగలసి

వధువున్న యింటికి వెళ్లెదరు. మరుదినముదయమున గ్రామమంతయు ప్రశాంతముగనుండును. ఉదయమే పొలములనుండి కావలయునీటిని మోసికొనివచ్చి వాతావరణము లేనుచుండి వారిగృహములకును వారు ధరించు విలువగల వస్త్రాలంకారములకును పరస్పర సంబంధము గన్పట్టదు.



వధువుతో కూడ వరునింటికి బైలుదేరుటకుముందు దృశ్యము వరుడు తనవలెనే అలంకరించుకొన్న మిత్రులతో గూడి గుఱ్ఱములపై బైలుదేరును.

యింటనుంచి స్త్రీలు వివిధవర్ణముల వస్త్రాలంకరణముల ధరించి వివాహమునకు సిద్ధమగుదురు. దరిద్ర

వధువు ఇతరాభరణములతో గూడ నొక 'కిరీటము' ముఖ్యముగ ధరింపవలసియుండును. ఆమె సిరోజ

ములు, అవసరమగుచో నవరములతో గూడ, రొక్కుగా దీర్చి దానికొక పట్టురిబ్బను గట్టుదురు. అరిబ్బను మూలమున వెండిగొలుసులు బంగరునాణ్యములు కూర్చబడును. దానిపై నుంచబడిన కిరీటము సుమారైదుపౌనుల బరువుండును. అది కదలక స్థిరముగానుండుటకు దారములతో గడ్డము క్రింద కట్టియుంచబడును.

ఈ యలంకరణములు ముగిసినంతట వధువు బంధుమిత్రులవద్దనుండి సెలవుదీసుకొనుటతో నుదయమంతయు గడుపును. ఈ కాలమంతయు రోదనము లొకవంక పాట లింకొకవంక ఆకసమునింపివైచును. ఈ వరుడు శ్వేతాశ్వము నెక్కి శైలుదేరును. కార్యజాలమును నడిపించు నాతడు ముందుదారి తీయుచుండ నితరులు వెంటనడచుచుండ నందరు వధువింటికి వెళ్ళుదురు. అచటవారి కందరికి భోజన మమర్చబడియుండును. అచటచేరిన వారందరు వధూవరుల నాశీర్వదించుచు వారి నూతన గృహనిర్మాణమునకై తలకొక నాణెమునిత్తురు. అంతట పెండ్లిపెద్ద రొట్టెజెండా నెత్తుకొని నాట్య మారంభించును. అతనితో పెక్కుమంది పాల్గొందురు. వరుడుకూడ చేరును. వారందరలసిపోవువఱకు నిలుపరు. సాయంకాల



వివాహోత్సవములందు ప్రాముఖ్యము వహించు నాట్యములందు స్త్రీ పురుషులెల్లరు పాల్గొందురు.

యడనుదాటిన వధువు వరునింటజరుగు వివాహమునకు వెళ్ళిన తరువాత బంధుమిత్రులను చూచుటరుదు.

మధ్యాహ్నము వరునింటిముందర పెండ్లికివచ్చు వారందరు గుమిగూడెదరు. వరుడు వారిని కలసికొనును. ఇంటిపై నెగురుచున్న జెండాను తీసిపోవుటకు సిద్ధపరతురు. ప్రయాణమునకు గుఱ్ఱములు తీసికొని వత్తురు. తనవలె నలంకరించుకొన్న మిత్రులకూడి మగును. ఇతరులందరుచుట్టుచేరి చూచుచుందురు. అచటనుండి పెండ్లికూతురియిల్లు చేరుదురు. అపుడు వధువు ఎఱ్ఱని ముసుగును నిండుగాధరించి యిల్లు వెడలివచ్చి శ్వేతాశ్వమునకు మువ్మారు నమస్కరించి నిలువబడగా నామెను గుఱ్ఱముమీది కెక్కింతురు. దానితో పెండ్లిగుంపు శైలుదేరును. కొంతదూరము వెళ్ళునప్పటికి పెండ్లికుమారుడు మిత్రులతో గుఱ్ఱముల నుఱాయించి

మైదానమున స్వారిచేయుచు వెంబడించు నితరులను పీడించును. ఇది బహుళాపూర్వము వధువునెత్తుకొని పోవువాడుక యొక్క వాసనలై యుండవచ్చును.

మరల నందరుగలసి యొకచో కొండపైనిలిచి వరు నింట వారిరాకను దెలుపుదురు. అంతట వధువు జీవితమందలి విధుల సూచించురీతి యొకపెద్దరొట్టె ముక్కయు కొంతఉన్నియు గడపలో నుంచెదరు. వధువు వచ్చినతరువాత నొకచో ప్రశాంతముగ కూర్చుండును. సంగీతాది వినోదములు సాగుచుండ వరుడు నాట్యమునందు పాల్గొనును.

మరుదినముదయమున వివాహము జరుగును. వారి యాచారముల ననుసరించి పురోహితునిబిల్చి వివాహ మును ముగింతురు. కల్యాణమహోత్సవము ముగిసిన వెంటనే గొఱ్ఱెలను వధించి పక్వముచేసి అందరుకూడి తిందురు. ఆదిన మా గ్రామమందెల్లరును తమకార్య ములను కట్టిపెట్టెదరు. ఆసాయంత్రముకూడ నృత్యము త్రాగుట జరుగును. ఆమరుదినముదయమునుండి బంధు మిత్రాదులు వధూవరుల నాశీర్వదింపవచ్చుచుందురు.



కారావాలాషీయను లితర పనులందుకంటె కంబళ్లుతయారుచేయుట యందెక్కువ శ్రద్ధవహింతురు. స్త్రీలెల్లపుడాపనియందే నిమగ్నులై యుందురు.

# గృహపరిశ్రమలు

సామాన్యముగా మనభారతదేశస్త్రీలకు ప్రొద్దున యైదుగంటలు మొదలు పండ్రెండుగంటలవరకును వంట మొదలయిన యింటిపనులు, శిశుపోషణము నుండును. మరల సాయంత్రము నాల్గుగంటల మొదలు ఆరుగంటల లోగా, బంధువుల యిండ్లకుగాని, ఏస్త్రీల సభలకు గాని పోవుటయు, సద్గ్రంథకాలక్షేపము చేయుటయు నగును. ఆటుతరువాత వంటలు భోజనములు జరుగును. దీనినిబట్టి తరుచుగా స్త్రీలోకమునకు పండ్రెండు మొదలు నాల్గుగంటలవరకును, అనగా నాలుగు గంటలు తీరుబడియుండును. ఈ తీరికసమయములో నిద్రపోవుటలేక వ్యర్థప్రసంగము చేయుట జరుగు చుండును.

సుమారు ఒకరూపాయి పావలా వెచ్చించి యొక యిల్లాలు ప్రత్తి కొనవచ్చును. ఈప్రత్తిని ప్రత్తి రాట్నముతో పట్టి, ఆమె వారముదినములలో గింజలు విడదీయవచ్చును. ఇట్లుచేసినచో ఒకవీసెదూదియును నాల్గువీసెలగింజలును అగును. ఆవి త్తనములమ్మి వేసిన, ఇప్పటిధరలలో ఎనిమిదిఅణాలు రావచ్చును. అట్లు చేసినచో, ఒకవీసెదూది పండ్రెండుఅణాలే ఖరీదగును. ఆదూది జొన్నపుల్లలకుచుట్టి యేకులు చేయవచ్చును. ఏకినదూదినుండి చేసిన యేకులు చాల బాగుగనుండును. ఆ యేకులను చక్కగావడికి, అరువదియవ నెంబరు నూలు తీయవచ్చును. దినమునకు నాల్గుగంటలు మాత్రమే పనిచేసినయెడల, ఐదురోజులకు ఒకవీసెడు యేకుల నూలు వడకవచ్చును. మిక్కిలి వేగముగా వడకినచో ఒకపక్షము దినములలోనే యీపని యగును. ఎంతయాలస్యముగా వడికినను ఒకమాసమున కెక్కువ యక్కరలేదు. వీసెయేకుల సన్ననూలు వడుకుటకు కూలి నాల్గురూపాయలు. రోజుకు నాలుగు గంటల చొప్పున పనిచేసి వీసెడు దూది యును పదునైదు దినములకును, ఇంకను త్వరగా తీయువారు పది దినములకును తమ శ్రమకు రెండు రూపాయల కూలి సంపాదింపగలరు. ఇక మూడవ రకపుమాట. పదియవ నెంబరుగాని, అంతకు కొంచెము తక్కువ నెంబరుగాని యుండును. ఈనూలుతో దుప్పట్లు చొక్కాగుడ్డలు మిక్కిలి ముదుకచీరలు నేసెదరు. ఈ నెంబరునూలు పిన్న పెద్దలందరును తీయగలరు. ఈనెంబరున ఒకవీసెడు దూది వడకుట కొకవారముకంటె యెక్కువకాలము కాదు. కూలిమాత్రము వీసెకు సుమారు ఒక రూపాయి కంటె నెక్కువయుండదు. మొదటచెప్పిన నూలుతో వీసెకును ఆయిదు జేనలు వెడల్పుగల పండ్రెండు

---

గమనింపు:—

గృహపరిశ్రమలచే ధనము గడించుటెట్లు ?

పై సమస్యపై ఉత్తమవ్యాసముల రచించిన సోదరీమణులకు ప్రథమ ద్వితీయ తృతీయ బహుమతులుగా రు 5, రు 3, రు 2. ఇవ్వబడును. సంపాదకుల తీర్మానమే అంత్యముగా పరిగణింపబడును. ఆ పరిశ్రమ యీక్రింది నిబంధనల ననుసరించి యుండవలయును. 1. గృహిణులు ఇవిడకనే స్వయంసహాయముతో చేసికొనుటకు తగియుండవలయును. 2. ఆ పరిశ్రమయందు విదేశవస్తువుల నుపయోగింపక అన్నివస్తువులును స్వదేశీయములై సులభముగా లభించునవిగా యుండవలయును. 3. ఈ పరిశ్రమ అనుభవసిద్ధమై గృహకృత్యముల కడ్డురాక యందరి అందుబాటులోనుండవలయును. 4. ఈ పరిశ్రమవలన తయారగువస్తువులు అందరికిని అత్యావశ్యకమైనవిగనుండి త్వరగా ఖర్చుగావలయును.

గజముల గుడ్డవచ్చును. రెండవరకము నూలు వీసెమండి అయిదుశేనల వెడల్పుగల పదిగజముల గుడ్డయును, మూడవరకపునూలు వీసెనుండి అయిదుశేనల వెడల్పుగల ఏడుగజముల గుడ్డయును వచ్చును. కనుక, సన్ననూలు వడుకువారు ఒకవీసెను ఇరువది దినములకు వడికినయెడల వారు నెలకు వీసెన్నరనూలు వడకవచ్చును. అట్లు చేసినయెడల నెలకు ఆరురూపాయల కూలి సంపాదింపగలరు. రెండవరకము నూలు వడకువారు నెలకు రెండువీసెల నూలు వడికి నాల్గు రూపాయల కూలి సంపాదింపవచ్చును. మూడవ రకము నూలు వడకువారు వారమునకు వీసెడు చొప్పున నెలకు నాలుగు వీసెలు తీయగలరు. వారికి నాలుగు రూపాయల కూలి వచ్చును.

ఇట్లు తీసిన నూలుతో మగ్గములమీద స్త్రీలు తమ యిండ్లలోనే బట్టలు నేయవచ్చును. నేత నేర్చుకొనుట మిక్కిలి కష్టముకాదు. ఇండ్లలోనే పాలీల సాయముతో పది పదునైదు రోజులలో మన మీ పని నేర్చుకొని, యితరులకును నేర్పవచ్చును. సొంతముగా ప్రత్తిపట్టి ఏకులుచేసి సన్ననూలుతో మన మగ్గములమీదనే చక్కని సన్ననూలుతో జేసిన చీరలు కట్టుకొనుటకు మన కెంతో సంతోషకరముగ నుండును. మన యుపయోగమునకు మించిన నూలును విక్రయముచేసిన కొంతసొమ్ము మనకు మిగులును. ఇక నేసిన కొలదిని నేత నలువడుచుండును. ఏనేత లోనైనను వారమునకు రెండు రూపాయలు కూలి వచ్చుచుండును.

ఇవిగాక బట్టలకు పలువిధములగు రంగులు వేయవచ్చును. వస్త్రములమీదను చిన్నసంచులమీదను అందమైన రంగులతో కళాకారుల సాయమున దేశసేవచేయు భారతస్త్రీపురుషుల బొమ్మలను ముద్రింపవచ్చును. మనకును మన పిల్లలకును గావలసిన చొక్కాలు, రవికలు మొదలగునవి మనమే కుట్టుయంత్రసహాయముచేగాని, చేతికుట్టుతోగాని కుట్టి యింటికర్చు కొంత తగ్గింపగలము. సబ్బులు సొంతముగా చేయుట, తలనూనెలను తయారుచేయుట, పూసలకుట్లు, పేముసామాను, పూలకుట్లు మొదలగు పనులు స్త్రీలు సాధింపవచ్చును. కూరగాయలు పండించి అమ్ముట, మరియు తుంగచాపలు, తాటియాకులచాపలు, బుట్టలు అల్లుట, విసనకఱ్ఱలు తయారుచేయుట, శక్తియున్నయెడల వడ్లుదంపి దంపుడుబియ్యము సిద్ధముచేయుట, పిండ్లు తిరుగలితో తయారుచేయుట, పసుపుకారములు కొట్టి సిద్ధము చేయుట ఇవియన్నియు ఆడువారు సాధింపగల కార్యములె. మన పిల్లల కుపయోగించుటకు పైనుండి వచ్చిన మరయాముదము గతియైనది! ఆముదపుదీపము పెట్టిన కండ్లకు చాలామంచిది. కనుక, ఆముదపు గింజలతో వంటాముదము, పచ్చియాముదమును సొంతముగా తయారుచేయవచ్చును. అట్లు చేసిన యెడల రెట్టింపులాభము కలుగును. ఆడువాండ్రు బంగారపుపని చేయుటకూడ చాల ముఖ్యమగు సంగతియే. బంగారు వెండినగ లలంకరించుకొనువారు స్త్రీలే గనుక తమ జాతివారగు స్త్రీలతో చక్కగ మాటలాడి తాము కోరినట్లు నగలు వారిచే చేయించుకొనవచ్చును. ఇత్తడి తగరముల గిన్నెలు చెంబులును కంచుసామానులను స్త్రీలే చేయవచ్చును. పూజపీటలను చేసి విక్రయించిన చాలడబ్బు వచ్చును. బంగారు, వెండి, ఇత్తడికంచు తగరము మొదలగు లోహపు, పనులు, వడ్రము ఆడువారు చేయుట యనిన కొందరికి పరిహాసముగానుండు నేమో! ఈ పనులుచేయు ఆడువాండ్రను కొందరిని నేను జూచితిని. తాము వితంతువులై జీవనోపాధిలేకపోవుటచేత తమ తండ్రులు నేర్పిన యావిద్య నుపయోగించుచున్నామని వారు చెప్పిరి! ఒకచోట నొకమూగపిల్ల వడ్రముచేయుచుండుట నే జూచితిని!

జీవనోపాధికొరకును ధనార్జనకును న్యాయమైన యిట్టి పరిశ్రమలు స్త్రీలుచేయు టావశ్యకము. ఇట్టి పనులు కొలదికాలములోనే నేర్చుకొనవచ్చును. ఈ పనులు నేర్చినయెడల మన దేశములో స్త్రీలు తిండిలేక యల్లాడనక్కరలేదు. స్వతంత్రముగ జీవనము జేసి సౌఖ్యముగ కాలముగడిపి దేశసౌభాగ్యమును స్త్రీలు పెంపొందింపగలరు.

శ్రీమతి పులుగుర్తు కనకమ్మ.

# శ్రీ శారదామణీదేవి

శ్రీ బులుసు వేంకటేశ్వరులుగారు

ఆధ్యాత్మికవిద్యారహస్యముల నామూలాగ్రముగ నెఱిఁగి, నిత్యానుష్ఠానసిద్ధుఁడై, తన హృదయసరోవరమునందుఁ గోరకమై బుట్టి, పెఱిఁగి, వికసించిన జ్ఞానభక్తివైరాగ్య పద్మసౌరభమును, ఒకేచోటనుండినను, ఖండఖండాంతరముల దేశదేశాంతరముల నలముకొనునట్లు జేసి నిర్యాణముఁ జెందిన లోకైకపూజ్యుఁడు శ్రీరామకృష్ణ పరమహంస. అనేకపూర్వజన్మ సముపార్జిత పుణ్యఫలంబుచే, పతివ్రతాజనతాలంకారమై, హైందవస్త్రీజాతి కాదర్శప్రాయమైన శ్రీ శారదామణీదేవి శ్రీరామకృష్ణపరమహంసకు సహధర్మచారిణి. ఈ మహామహురాలిని పతిగాఁ బడయుఁజాలకపోయినచో శ్రీరామకృష్ణుఁ డంతటి మహామహుఁడు కాఁజాలక పోయెడివాఁడని యెందఱో వాక్రుచ్చియున్నారు.

ఈమెది వంగదేశము. ఆదేశమునఁగల "బంకూరా" యను జిల్లాయందుగల "జయరాంబటి" యను చిన్నపల్లెటూరియం దీమె 1853 వ సంవత్సరమున బీదబ్రాహ్మణవంశమున జన్మించినది. ఈమె పల్లెటూరి వాతావరణమునఁ బెఱిఁగి శ్రద్ధాభక్తిసమన్వితయై, దైవచింతనతో బాల్యమునుండియుఁ గాలముఁ బుచ్చుచుండెడిది. ఈమె కతి బాల్యముననే యైదవయేట వివాహమాయెను. *

శ్రీ రామకృష్ణుఁ డాధ్యాత్మికదృష్టిఁగలవాఁడై ప్రపంచదృష్టిమఱచి యుండెనిమగ్నుఁడై నతఁడి నాతనితల్లియు, సోదరుఁడును భయపడి వానికి వివాహమొనరించినయెడ నా దృష్టి మరలుననియెంచి యాతని యిరువదినాల్గవసంవత్సరమున నైదేండ్లబాలికయగు శారదతో వివాహమొనరించిరి. కాని వారు తలఁచినప్రకారముగాక శారదామణి కూడ నాధ్యాత్మికదృష్టిగలదే యగుటచే శ్రీరామకృష్ణుఁడను దావకునకామె యింధనమై యాధ్యాత్మికాగ్నిని మహోజ్జ్వలముగఁ బ్రజ్వలింపఁ జేసినది.

ఈమెకు బాల్యమునుండియు పతిభక్తి యలవడినది. ఆతని నెల్లప్పుడును హృదయఫలకమునఁ జిత్రించుకొని పూజించుచు, ఆతని దర్శనభాగ్యమెప్పు డబ్బునోయనియు, పతిసేవఁజేయుభాగ్య మెన్నటికిఁగల్గునో యనియు నెదురుచూచుచుండెడిది. ఆహా! బాల్యమునుండియు పతిని సేవించవలెననియు బతియే సతికిఁ బరమదైవతమనియు నేర్చుకొను హిందూవనిత పరమపుణ్యకదా!

ఈమె బాల్యమునందే భర్తకు నస్వస్థతగనున్నపు డాతనికడ నుండెడిది. ఆదినములలో నామె యుదయముననే గంగాస్వచ్ఛతరంగముల జలకమాడి భక్తినంయుక్తితో భర్తనే సేవించుచుండెడిది. కాని శ్రీరామకృష్ణుఁ డీమెను సరిగాఁజూడనైన జూచెడివాఁడు

* శ్రీశారదామణీదేవి జీవితము శ్రీ బులుసు వేంకటేశ్వరులుగారిచే విపులముగ రచియింపఁబడి యచ్చులోనున్నది. స్త్రీల కుచితముగ నొసంగఁబడును. వలయువారు బులుసు వేంకటేశ్వరులుగారు. విద్యార్థి, పి. ఆర్. కాలేజీ కాకినాడ అన్వివాసినఁ బడయఁగలరు.

కాఁడు. ఐనను, ఆతని ముఖసందర్శనమే మహాభాగ్యమని యెంచి దానితోనే తృప్తిఁ జెంది భర్తృపదసేవఁ జేయుచుండెడిది.

యౌవనోదయమైనపిదప, శ్రీ రామ కృష్ణుఁడు దక్షిణేశ్వరమున నున్నపుడు, శారదామణీదేవి తనభర్త ఆధ్యాత్మిక దృష్టిచేఁ బిచ్చివాఁడాయెనని విని యాతని కడకేగెను. ఆమెనుఁ జేరఁదీయుటకు శ్రీ రామకృష్ణునకు సంశయముకలిగెను. ఏలయన, ప్రతిస్త్రీయందును జగజ్జననిరూపమును సాక్షాత్తుగఁజూడఁజాలు నాతఁడొక స్త్రీని తనభార్యగ నెట్లు పరిగణింపఁగలఁడు? కాని, భర్తృపదసేవకొఱకును, కొద్దియో గొప్పయో నేర్చికొనుటకే వచ్చితిఁగాని సంసారసుఖములకుఁగాదని నచ్చఁజెప్పి యాతని యంగీకారముఁబడసెను. ఇతర ఋషులు, మునులు స్త్రీలనిందించి, తాము కామకాంచనాకాంక్షను జయింపలేక స్త్రీలే వారినిఁ జెడఁగొట్టుదురని పిచ్చినమ్మకముఁ గలవారై, స్త్రీలపై నిందారోపణములఁ జేతురు. కాని శ్రీరామకృష్ణుఁడు వారివలె గాక స్త్రీయట్టి పదార్థముగాదనియు మానవుఁడు దుర్మార్గమునఁ బ్రవర్తించునపు డాతనికి మహోపకారముఁ జేసి సన్మార్గమునఁ బ్రవేశపెట్టునదేయనియు నెంచి యామెను గ్రహించెను. ఇదియే శ్రీరామకృష్ణపరమహంసకు నితరపరమహంసలకుఁ గలభేదము. దైవాంశగలస్త్రీని నిందింపక యామెయందే జగజ్జననిరూపుంగాంచి లోకమునకుఁజాటిన ఘనుఁడు.

తనభార్యను సంకోచింపక స్వీకరించుటయేగాక తాను గృహస్థుఁడై నందులకు వివాహమాడినందులకు తనవిధి తనభార్య నెల్లవిషయములలోను మహోన్నతస్థితికిఁ దీసికొనివచ్చుటయేయని యెంచి దివ్యోపదేశముల నొసంగి యాధునిక ప్రపంచమునకు మంచినీతిని యాచరణపూర్వకముగఁ జూపినాఁడు. గృహవిషయములను, ఆధ్యాత్మిక విషయములను, అందలి రహస్యములను, ఈతఁడు స్వయముగాఁ దనభార్యకు బోధించినాడు. అంతియేగాదు పల్లెటూరియందున జన్మించి యేమియు నెఱుఁగని సతి కెల్ల విషయములను — ఎంతచిన్న విషయములైనను-దీపము తుడుచువిధానము, వత్తిఁగోయు తీరు, బంధువులయెడ సత్తమామలయెడ నిరుగుపొరుగువారియెడ నడచుకొనవలసిన విధులు — ఈయన భార్యకు నేర్పినాడు. నేఁటి నాగరిక ప్రపంచమున బ్రతి గృహస్థుఁడును తనభార్యకు శ్రీరామకృష్ణుని రీతి వివిధవిషయములు బోధించి యౌన్నత్యస్థితికిఁ దీసికొనివచ్చుచో హిందూసంఘమిట్టి నీచస్థితిలో మ్రగ్గవలసిన యావశ్యకతయుండునా? అట్లుజేయుచో హిందూసంఘము మహోన్నతస్థితిఁ బొందుఁగదా!

శ్రీరామకృష్ణ శారదామణు లొక్కే మంచముపై బరుండినపుడైనను శ్రీరామకృష్ణుఁడు ధ్యానమునందు నిమగ్నుఁడై యొడలు మఱచెడివాఁడు. ఆతనిశరీరము చల్లపడి శవమువలె బడియుండెడిది. ఇది జూచి శారద భయపడెడిది—శారదామణి సంసార

సుఖముల నభిలషింపక పోవుట పరికదా చాల మంది పిల్లలుగల స్త్రీల నిందించుచు నింద్రియ నిగ్రహత్వమున్ననే కాని జాతి బాగు పడఁజాలదని బోధించెడిది. తన విషయము తనభర్త విషయము వారికి జెప్పుచుండెడిది. వారి పవిత్రజీవితములఁబఠించి వారికున్న యింద్రియనిగ్రహత్వాదిశక్తుల సంపాదింపఁ బ్రయత్నించుచు హిందూదేశమున "జన్మనిరోధకశాసనావశ్యకత" కలుగునా?

గురుదేవుఁడు మరణించినపిదప నొకనాఁడామె వితంతువులు ధరించు ధౌతవస్త్రముల నామె ధరించుచుండఁగ గురుదేవుఁడు ప్రత్యక్షమై "నే చనిపోతినని యెంచి యిట్లు చేయుచుంటివా? మూఢనమ్మకము లింకను పోలేదా?" యని వాక్రుచ్చెనట! అప్పటి నుండి యామె యెన్నడు నటులఁ జేయఁ బ్రయత్నింపలేదు.

తండ్రి చనిపోయిన శిష్యునొకని నోదార్చుచు, నాతని కామె మాతృపూజ, మాతృసంరక్షణదీక్ష, మొదలగువానిఁ గూర్చి బోధించెను. నవమాసములునిండి, యనేకశ్రమల కోర్చి కని, పెంచి, పెద్దఁ జేసి, విద్యాబుద్ధులఁ గఱపి పోషించినందులకు, మన తల్లులకు మహోపదేశముల బోధించుచు వారి కైహికాముష్మికసుఖము లొసఁగఁ బ్రయత్నించి కృతకృత్యులమైనచో మన ఋణము దీర్చికొనఁజాలినవార మగుదుమని బోధించెను.

ఈ మాత మహామహూరాలనియు దైవాంశసంభూతురాలనియుఁ బ్రపంచమంతటను మాఱ్మ్రోగినను, అనేకవేల శిష్యులు, శిష్యురాండ్రు దూరదేశముల నుండి, ఖండఖండాంతరములనుండి వచ్చి దర్శనభాగ్యము లభింప ధన్యులై తరలి పోవుచున్నను ఆమె యెన్నఁడు గర్వముఁజూపి యెఱుఁగదు. ఎట్టిసమయములలో నెవరు వచ్చినను, వారికి దర్శనమొసఁగి, యోగక్షేమములడిగి, యోదార్చి పంపుచుండెడిది.

తనభర్త శిష్యులకు స్వయముగా వండి పెట్టెడిది. వారిని పుత్రులకన్న నెక్కుడుగా జూచుకొనెడిది. సన్మార్గవర్తనులును, నిశ్చంచలహృదయులును, విశ్వవిఖ్యాతయశస్కులునగు నాశిష్యులే తనకు దనభర్త యనుగ్రహించిన పుత్రరత్నములని మురిసి పోయెడిది. ఎట్టిపనియైనను నీచమని యెంచక స్వయముగజేసి సర్వమానవ సౌభ్రాతృత్వముఁ జూపుచునుండెడిది. మహోపదేశముల నొసంగి యనేకుల నానందవార్నిధులఁ దేల్చెడిది.

అర్ధాంగియైనందులకు శ్రీరామకృష్ణున కన్నివిషయములలోను నర్ధభాగముఁగలిగి, ఆయన జీవితమే తన జీవితము, తన జీవితమే యాయన జీవితముఁ జేయఁగల్గి యాధునిక హైందవస్త్రీల కాదర్శప్రాయమై పతివ్రతాజనతాలంకారమైన యీ యమ జీవితము ధన్యము జేసికొన్నది. ఈఁపెబోటి లలినాలలామ లీ హిందూదేశమునకుఁ గొంతకాదు. ఈ మహామహురాలి చారిత్రఁ జదివి జీర్ణించికొని ధన్యులయ్యెదరు గావుత!

# ప్రసవకాలమును దెలుపు పట్టిక.

సాధారణముగ స్త్రీలు గర్భము ధరించిన 280 దినములకు ప్రసవించెదరు. కడపటి బహిష్టునైన పెండ్లిదినము మొదలు లెక్కపెట్టుకొనవలయును. క్రిందనుదహరించిన పట్టిక మొదటిపంక్తి జనవరి 1.వ తారీఖున గర్భము ధరించినయెడల రెండవపంక్తి అక్టోబరు 8-వ తారీఖున ప్రసవించెదరు.

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| జనవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జనవరి |
| అక్టోబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | నవంబరు |
| ఫిబ్రవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | | | | ఫిబ్రవరి |
| నవంబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | | | | డిసంబరు |
| మార్చి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మార్చి |
| డిసంబరు | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 33 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | జనవరి |
| ఏప్రెల్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | ఏప్రెలు |
| జనవరి | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | | ఫిబ్రవరి |
| మే | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మే |
| ఫిబ్రవరి | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మార్చి |
| జూను | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | జూను |
| మార్చి | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | ఏప్రెలు |
| జూలై | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జూలై |
| ఏప్రెల్ | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 23 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మే |
| ఆగష్టు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | ఆగష్టు |
| మే | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | జూను |
| సెప్టంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | సెప్టంబరు |
| జూను | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | | జూలై |
| అక్టోబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | అక్టోబరు |
| జూలై | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | ఆగష్టు |
| నవంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7. | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | నవంబరు |
| ఆగష్టు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | సెప్టంబరు |
| డిసంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | డిసంబరు |
| సెప్టంబరు | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 7 | 6 | అక్టోబరు |

| ఉ. | అ. | | | |
|---|---|---|---|---|
| 6-20 | 6-5 | | 1 | సో. చ.సా4-47 చిత్రసా8-57 రావ1-13 ల2-59 కుదుప12-33 పునర్దుప2-53 స॥తి॥ |
| 6-20 | 6-5 | | 2 | మం. పం. సా6-48 స్వారా9-28 తెవ3-44 ల5-30 కుదుఉ8-40 రాదు11-1 |
| 6-19 | 6-6 | | 3 | బు. ష. సా8-56 విశారా12-5 తెవ4-35 ల6-19 కుదుప11-47 |
| 6-18 | 6-6 | | 4 | గు. స. రా11-2 అనూరా2-40 వలేదు దుప10-12 పునర్దుప2-54 |
| 6-18 | 6-6 | | 5 | శు. అష్ట. రా12-57 జ్యేతె5-3 ఉవ8-49 ల10-35 కుదుఉ8-39 పునర్దుప12-34 |
| 6-17 | 6-6 | | 6 | శ. న. రా2-29 మూ24-0 పేవ1-42 ల3-25 కుతెవ 5-19 దుఉల7-52కు |
| 6-16 | 6-7 | | 7 | ఆ. ద. తె3-39 మూఉ6-59 శేవఉ6-59 కుసావ5-12 ల6-57 కుసాదు4-29 |
| 6-15 | 6-7 | | 8 | సో. ఏ. తె4.7 పూషాఉ8-31 సావ4-42 ల6-32 కుదుప12-32 పునర్దుప2-54 |
| 6-15 | 6-7 | | 9 | మం. ద్వా. తె4-19 ఉషాప9-36 పవ1-41 ల3-19 కుదుఉ8-36 రాదు11-0 |
| 6-14 | 6-7 | | 10 | బు. త్రి. తె3-55 శ్రప10-9 పవ2-11 ల3-47 కుదుప11-45 |
| 6-13 | 6-6 | | 11 | గు. చతు. రా2-56 ధప10-15 సావ5-20 ల6-51 కుదుప10-10 పునర్దుప2-54 మహాశివరాత్రి |
| 6-12 | 6-8 | | 12 | శు. అమా. రా1-38 శప9-53 సావ4-5 ల5-38 కుదుఉ8-34 పునర్దుప12-31 |
| | | 1937 మార్చి | | శ్రీ ధాతృనామసం॥ర ఫాల్గునమాసము ఆక్ 1937 సం॥రం |
| 6-12 | 6-8 | | 13 | శ. పా. రా11-54 పూభాప9-9 సావ6-23 ల7-54 కుదుఉల 7-47కు |
| 6-11 | 6-8 | | 14 | ఆ. వి. రా9-54 ఉభాఉ8-2 సావ7-26 ల8-57 కుసాదు4-29 [2-53 |
| 6-10 | 6-8 | | 15 | సో. తసా7-41 రేఉ6-40 అశ్వితె5-10 రావ1-29 ల2-59 కుదుప12-13 పునర్దుప |
| 6-9 | 6-8 | | 16 | మం. చ. సా5-20 భతె3-30 పవ2-5 ల3-34 కుదుఉ8-32 రాదు10-59 చవితితిధి |
| 6-9 | 6-9 | | 17 | బు. పం. ప2-57 కృరా1-47 పవ2-39 ల4-8 కుదుప11-43 తిధిద్వయం [54సతి॥ |
| 6-8 | 6-9 | | 18 | గు. ష. ప12-32 రోరా12-10 సావ4-43 ల6-12 కుతె5-29 దుప10-7 పునర్దుప2- |
| 6-7 | 6-9 | | 19 | శు. స. ప10-16 మృరా10-38 శేవఉ6-54 కుదుఉ8-30 పునర్దుప12-[illegible]0 |
| 6-6 | 6-9 | | 20 | శ. అష్ట. ఉ8-9 ఆర్ద్రరా9-27 ఉవ6-37 ల8-8 కుదుఉల7-42కు [సాదు4-30 |
| 6-6 | 6-9 | | 21 | ఆ. న. ఉ6-18 ఏతె4-43 పునసా8-31 ఉవ8-59 ల10-31కు తెవ4-22 ల5-55కు |
| 6-5 | 6-10 | | 22 | సో. ఏ. తె3-30 పుష్యసా7-54 వలేదు దుప12-30 పునర్దుప2-54 |
| 6-4 | 6-10 | | 23 | మం. ద్వా. రా2-52 ఆశ్రేసా7-46 ఉవ8-37 ల10-13 కుదుఉ8-28 రాదు 10-58 నృసింహద్వాదశి |
| 6-3 | 6-10 | | 24 | బు. త్రి. రా2-37 మఘసా8-2 ఉవ7-53 ల9-30 కుతెవ4-22 ల6-1 కుదుప11-41 |
| 6-2 | 6-10 | | 25 | గు. చతు. రా2-59 పూఫసా8-51 తెవ4-29 దుప10-3 పునర్దుప2-53 |
| 6-2 | 6-10 | | 26 | శు. పూ. తె3-45 ఉఫరా10-7 శేవఉ6-7 కుదుఉ8-27 పునర్దుప12-29 |
| 6-1 | 6-11 | | 27 | శ. బహు. పాతె5-5 హస్తరా11-54 ఉవ7-8 ల8-51 కుదుఉల7-38కు చూతకుసుమభక్షణం |
| 6-0 | 6-11 | | 28 | ఆ. వి. 24-0 చిత్రరా2-2 ఉవ8-36 ల10-20 కుసాదు4-30 |
| 5-59 | 6-11 | | 29 | సో. వి. ఉ6-43 స్వాతె4-30 ఉవ8-12 ల9-53 కుదుప12-28 పునర్దుప2-53 |
| 5-58 | 6-11 | | 30 | మం. త. ఉ8-46 విశా24-0 పవ10-41 ల12-27 కుదుఉ8-24 రాదు10-56 |
| 5-58 | 6-11 | | 31 | బు. చ. ప10-53 విశాఉ7-7 పవ11-33 ల1-19 కుదుప11-39 |

* ఉ—ఉదయము; ప—పగలు; సా—సాయంత్రము; రా—రాత్రి; తె—తెల్లవారుజాము; వ—వర్జ్యము; ల—లగాయతు; కు—ఆఖరువరకు; శేవ—శేషవర్జ్యము. తిధిగాని నక్షత్రముగాని చేయబడిన ప్రమాణమునకు ఆఖరు అని తెలుసుకొనవలెను.

# సోయాబీను

చదువుల రామచంద్రయ్యగారు

(గతసంచిక తరువాయి)

సోయాబీను నెట్టిభూములందును పండింపవగును కాని క్షారము, సున్నము, భాస్వరామ్లము (Potash Lime, and Phosphoric acids) అధికముగానున్న ఇసుక, రేగడభూములు శ్రేష్ఠముగనుండును. మంచూరియాయందు నల్లరేగడ మట్టియినుక నేలయందిది మంచిఫలితము నిచ్చుచున్నది. అమెరికాసంయుక్తరాష్ట్రములందు ప్రత్తి, ధాన్యము పండించుభూములందును, ఆఫ్రికాయందు గోధుమలు పండించుభూములందును నిది పండింపబడుచున్నది. దీనిపంటకు భారతదేశమందన్ని విధములైనభూములు మంచివని తెలియుచున్నది. అందులో రేగడిభూములు చాలయుపకరించునని వ్యవసాయశాఖవారు పరిశోధించి నిర్ణయించియున్నారు.

అత్యధికశీతోష్ణములు సోయాబీనుల పంటకు చెడుపునుగల్గించు గాన సమశీతోష్ణప్రదేశములకే యిది తగియుండును. అందువలనే యూరపుఖండమున నుత్తరభాగములందీపంట యభివృద్ధి జెందకుండుట.

భూములను సారవంతముచేయుకొరకిది యితర పంటలవలె సోయాబీను మంచిఫలితములనిచ్చును. దీనిని పంటబెట్టుభూములు ఎండకాలారంభమందు లోతుగాదున్ని కొన్నిదినములుండనిచ్చి తరువాత రెండుమూడుమారులు గుంటక (పాపటము) నుపయోగింతురు. తరువాతకూడ భూమిని విత్తులు నాటుట కుపయోగపడునట్లు చదును చేయుదురు.

సోయాబీనుల నేబుతువునందైన చల్లవచ్చును. అది శీతకాలమందును ఎండకాలమందునుకూడ పంటగును. కాని వర్షాకాలము శ్రేష్ఠమైనది. వర్షములారంభమైన కొలదికాలమునకు తరువాత, జూను నెల 15 వ తేది యనంతరము విత్తడముమంచిది. ఋతుప్రారంభమున గుజరాత్‌నందు గొంగళిపురుగులమితము; కావున వానికాలము దాటినతరువాత, పేరకొను మంచు (Frost) గల కొండప్రదేశములలో నాకాలమున పీడితము విత్తుట శ్రేయము.

సోయాబీనులను వరుసలువరుసలుగా విత్తవలయును. అది గొర్రు మొదలగుసాధనములతో చేయవచ్చును. కొంతప్రదేశముమాత్రమే పంటబెట్టు నెడ చేతితో విత్తనముల వెదజల్లుటయుగలదు. వరుసలుగా విత్తనములనాటినచో రెండువరుసలకుమధ్య 2 నుండి 3 అడుగులస్థల ముండవలయును. చైనా మంచూరియా దేశములందు రెండువరుసలకు 17 అంగుళముల దూరముమాత్రముంచి, వరుసలో రెండువిత్తులకుమధ్య రెండుఅంగుళముల దూరముంచి విత్తులనునాటెదరు. కాని మనదేశములో రెండుమొక్కలకుమధ్య 3, 4 అంగుళముల దూరముండుట శ్రేష్ఠము.

మంచూరియాలో ఎకరమునకు 16 నుండి 20 పౌనుల గింజల నుపయోగింతురు. కాని పల్లపుభూములకు వీనిలో సగము చాలును. పశువుల మేతకు గాని మొక్కల నెరువుకొఱకుపయోగింపదలంచినపుడు గాని యొకరమునకు 40 నుండి 60 పౌనులుచల్లుట మేలు.

గింజలను చాల లోతుగానాటినచో మంచి ఫలితము నివ్వవు. కఠినముగనుండు భూములందు రెండంగుళములకంటె లోతున గింజలను పూడ్చరాదు.

ఒకటి ఒకటిన్నర అంగుళములలోతున బూడ్చిన గింజలు మంచిఫలితము నొసగినటుల తెలియుచున్నది.

వర్షమమితముగగురియు ప్రదేశములందు వర్షములు ముగిసినతరువాతను వర్షపాతము 30 మొదలు 50 అంగుళముల లోపలనున్న ప్రదేశములందు వర్షాకాలమునందును గింజలను విత్తుటమంచిది. సోయాబీనును సంవత్సరమునకు రెండుమారులు పండింపవచ్చును. వరిపంట తరువాత నీపంట బెట్టవచ్చును. కాని నీరెక్కువ నిలుచుచోటున యీపంటకాదు ఎక్కువ వర్షమునకుకూడ పూవులురాలి పంటపాడగును.

చైనామంచూరియా దేశములందు సోయాపంటకు పశువులయెరువే యుపయోగింతురు. జపానునందు భాస్వరము సున్నము ఎక్కువగాగల యెరువును

వాడుదురు. ఎరువులలో సారజనక సంబంధమైన (Nitrogenous) యెరువు హెక్కువ సాయపడును. మన దేశమందుపయోగింపబడు పశువులయెరువు కూడ నెక్కువగా నుపకరించును. ఎకరమునకు 10, 15 బండ్లు మంచిదిగనున్న పైయెరువు వేసిన చాలును.

సోయాబీనులను పంట యీవిధముగా పెట్టవచ్చును. మొదట బాగుగాదున్నినభూమిని అప్పుడప్పుడు గుంటక తోలుచు నుండవలెను. వర్షాకాల మారంభమైన తోడనే గింజలను చల్లవచ్చును. అవి 7 నుండి 9 రోజులలో మొలకలెత్తును. తరువాత పూవులు పూయు వఱకు వాని మొదళ్లకు మట్టిని రెండు ప్రక్కలగట్టుగా వేయుచుండవలయును. పూవులుపూయుటకు సాధారణముగ 45 దినములు పట్టును. పంటపూర్తియగుటకు 70 నుండి 80 దినములుపట్టును. కాయలు గోధుమవర్ణమునకు తిరిగి ఆకులురాలుటకు ప్రారంభించిన తరువాత కోతకువచ్చినదని తలంపవలయును. కోసినతరువాత యెండించి గింజలను సులభముగ రాల్చుకొనవచ్చును.

మంచూరియాయందు సోయాబీను ఇతరదేశములందుకంటె యెక్కువపంట నిచ్చుచున్నది – యెకరమునకు 1100 నుండి 1600 పౌనులవఱకు. కాని మనదేశమునందు 700 నుండి 900 పౌనులుమాత్రమే. కాలక్రమమున మంచివిత్తనములచే పంట నభివృద్ధిపొందింపవచ్చును.

పశువుల మేతకొఱకై సోయాపంట పెట్టినపుడు గింజలు దట్టముగా చల్లవలెను. కాయలు ముదురుట కారంభింపకముందె కోయవలయును. అంతకంటె యెక్కువ కాలముంచినచో కాడలు బలమెక్కి మునుపటి విలువను గోల్పోవును; ఆకులన్నియు రాలిపోవును. కోసినపంటనే ప్రోవుచేసి, యొకటిరెండుదినములు పొలమునందే యుండనిచ్చిన తరువాత చిన్నచిన్న కట్టలుగా గట్టవలయును. అయిదారుదినములకు తరువాత నది మంచిమేతయగును.

రెండు సంవత్సరములకంటె ప్రాతవి విత్తనములను చల్లుట కుపయోగించిన నుపయోగముండదు. ఎంత క్రొత్తవైన అంతమంచిది. సోయాను నిలువచేయుటలో నవి వేడెక్కకుండునట్లు జాగ్రతపడవలెను. లేకున్న అవి విత్తుటకు కుపకరింపవు. అవి నిలువచేయుటకు ముందు బాగుగా ఆరబోయుట మంచిది.

# ప్రేమ సమస్య

శ్రీమతి తాడి నాగమ్మగారు

(గతసంచిక తరువాయి)

డిక్టేటరులు అధికారమునకు వచ్చుటతో ప్రపంచపరిస్థితులు తారుమారైనవి. మహాయుద్ధకాలమునందొక సామాన్యరాజ్యముగ నుండి యుద్ధమందు పాల్గొనిన ఇటలీ ముస్సోలిని హస్తగతమగుటతోనే బలిష్ఠమగు నొక రాజ్యముగ మారిపోయినది. దినదినమునకు పెరుగుచున్న జనసంఖ్యకు తగిన వలస రాజ్యమును వెతకుటకై ప్రయత్నములు చేయసాగినది. యుగయుగములనుండియు ఇటలీ అబిసీనియాపై దృష్టులు నిగిడింపసాగినది. క్రీస్తుకు పూర్వము అగస్టస్ మహాచక్రవర్తి అబిసీనియాపై దండెత్తియు తన యభిమతము కొనసాగించుకొనలేక వెనుకకు మరలినాడు. మరల 1894 సంవత్సరములో ఇటలీ సైన్యాధికారులు అబిసీనియాపై దండెత్తి పూర్తిగ ఓడిపోయిరి. నాటినుండియు ఇటలీ అబిసీనియాను కబళింప బూనుచున్నది. తగిన సమయమునకై ముస్సోలిని వేచియున్నాడు. ప్రపంచపరిస్థితులు క్రమముగ మారసాగినవి. మొదటి యుగములందు మెట్టసైన్యములు బలముగనున్నవారు అజేయులై రాణించుచుండిరి. తరువాత యుగములందు సముద్రపుయుద్ధపు టోడలు కలిగియున్నవారు అజేయులై ప్రకాశించుచుండిరి. 16 వ శతాబ్దమునుండియు సముద్రపు బలమునందు ఇంగ్లాండును మించిన రాజ్యములేకుండెను. గాని కాలక్రమమున విమానములు సృష్టింపబడినవి. వానిముందు యుద్ధనావలు రాణించవు. ఇటలీ యీ విమానపు బలమును బాగుగా వృద్ధిచేసికొనినది. ఆంగ్లేయులనుకూడ ధిక్కరించగల ఆయుధసామాగ్రిని సమకూర్చుకొన్నది. తగిన సమయము కనిపెట్టి వెంటనే అబిసీనియాపై గిల్లికజ్జము రగులుకొల్పినది. ఒకమిషపై యుద్ధముకల్పించి క్రమముగ అబిసీనియాను కబళింపసాగినది. జాతిసమితి ఇటలీయొక్క ధైర్యసాహసములను జూచి దిగ్భ్రమచెందసాగినది. ఇటలీని యేమిచేయుటకును వెరచినది. వెంటనే ముస్సోలిని జాతిసమితియొక్క ఆయువుపట్టును త్రవ్వివేయసాగినాడు.

ఇట్లు జాతిసమితి ఇటలీతో ప్రాణాంతకమైనపట్లు పట్టుచుండు సమయమున తగిన అదను కనిపెట్టి హిట్లరు వర్సైల్సు ఒడంబడిక భగ్నపరుప యత్నించినాడు. వర్సైల్సు సంధిషరతుల ననుసరించి రైనులాండు ప్రదేశమునందు సైన్యములుంచకూడదనెడి షరతు నుల్లంఘించినాడు. రైనులాండు పొడుగునను బూజపట్టియున్న కోటబురుజులను బాగుచేసి వానిని సైన్యములతో నింప ఆల్బర్టును నియోగించినాడు.

హిట్లరు ఆజ్ఞలను శిరసావహించిన ఆల్బర్టు రైనునదీతీరముననున్న జర్మన్ కోటలను

పునర్నిర్మితము కావింప సైన్యములతోను పనివాండ్రతోను ఆప్రదేశము నాక్రమించినాడు. పురాతన జర్మను సామ్రాజ్యవైభవ చిహ్నములైన యా పురాతనదుర్గముల నొక్కొక్కదానిని పరిశీలింపసాగినాడు. శత్రువులదాడుల నరికట్టుటకేగాక మిత్రుల కాశ్చర్యముగొల్పు అందలి కళాకౌశల్యమున కాశ్చర్యము పొందుచు మరింత యుబలాటముతో ప్రతికోటను పరీక్షింపసాగినాడు.

పురాతనపుకోటలయొక్క నిర్మాణకళాకౌశల్యమును తనివితీరని పిపాసతో వెదకుచున్న ఆల్బర్ట్ నకు హృదయభేద్యమగు దృశ్యములెన్నియో అందలి భూగృహములందు కాన్పించినవి. వానిని గాంచుకొలది ఆల్బర్టునకు దేహము కంపమెత్తసాగినది.

ఒక కోటలోనున్న భూగృహముయొక్క కళాకౌశల్యము ఆల్బర్టు పరీక్షింపసాగినాడు. అందలి మారుమూలగదిలో చిక్కిశల్యమై వికారరూపముతోనున్న యొక మానవుని జూచి విభ్రాంతుడైనాడు. అపుడు ఆల్బర్ట్ అతనిని-

"ఎవరు నీవు?"

"ప్రపంచముచే విస్మృతము కాబడిన మానవుణ్ణి."

"ఇక్కడేమి చేయుచున్నావు?"

"బంధింపబడి కుములుచుంటిని."

"ఎందుచేత బంధింపబడితివి?"

"ప్రేమించిన కన్యను పెండ్లాడినందుకు."

"సోదరా! నీ మాటలు నన్ను భయభ్రాంతునిగ జేయుచు విషాదమున ముంచివేయుచున్నవి. నీయుదంతమును సవిస్తరము జేసి, నా యాత్రుతను చల్లబరచెదవుగాక!" అని ఆల్బర్టు కరుణార్ద్రహృదయుడై ఆ నిర్బంధితుని ప్రార్థేయుడై అడిగెను. తన యుదంతమును తెలిసికొనుటకై మానవలోకమునుండి పాతాళమునందు బంధింపబడిన తనయొద్దకు ఒక మానవజీవియైనను రాగలిగినందుకు ఆబంధితుడు సంతృప్తిపడసాగెను. నశించుచున్న యాతడు ఎదుటి ఆల్బర్టుయొక్క ఉద్యోగ వివరములు తెలిసికొనకయే తన చరిత్ర నేకరువుపెట్టసాగెను. "నేను లిప్జిగ్ నగరవాసుడను. నాపేరు లియోపాల్డు. నా తండ్రి గత మహాసంగ్రామమునందు పేరుపొందిన హిండెన్‌బర్గునకు దాయాది. నేను నాజీసైనికుడుగ తర్ఫీదుపొందు సమయమున ఒక యూదులకన్యతో పరిచయము కలిగినది. ఆమె సుగుణరాశి. నిష్కల్మష హృదయ. నన్ను త్రికరణశుద్ధిగ ప్రేమించిన భాగ్యరాశి. ఆమెపేరు......' అని చెప్పసరికి ఆబంధితునికి దుఃఖము పొంగి పొంగి వచ్చినది. కన్నీటిచుక్కలు జలజల రాలసాగినవి. అదంతయు చూచుచున్న ఆల్బర్టునకు కడుపులో చేయిపెట్టి కలచివైచినట్లైనది. దగ్గరకుచేరి ధైర్యము చెప్పుచు ఆల్బర్టు ఆ నిర్భాగ్యపు నిర్బంధితుని బుజ్జగింపుచు తక్కినయుదంతము విన త్వరపడెను. అంత నాతడు లోతు కన్నులనుండి ఊటలూరు జలరాసులను బంధించి యిట్లు మరల చెప్పదొడగెను. "నే నామెను త్రికరణశుద్ధిగ ప్రేమించితిని. నా జీవితమున

కామెను చుక్కానిగ నిశ్చయించుకొంటిని. ......మరచితిని. ఆమెపేరు సోఫియా. నే నామెను ప్రేమించుట నాజీలదృష్టిలో పాపహేతువైనది. నాజీనాయకులు ఆదిలోనే అట్టిపని వలదని హెచ్చరించిరి. నిష్కల్మషహృదయినియగు నా ప్రేయసిని జూడకుండగ ఉండలేనివాడనైతిని. నాజీనాయకుల హెచ్చరికలను లెక్కచేయలేదు. ఒకనాడకస్మాత్తుగ నాయింటిని సోదాచేసి నన్నును నా ప్రేయసిని నిర్బంధించిరి. మమ్ములను వర్ణనాతీతమైన బాధలకు లోనుగావించిరి. తుద కామె నెచ్చటికో గొనిపోయిరి. నన్నీ యంధకారబంధురమందు నిర్బంధించి మూడు వత్సరములైనది. నా సోఫియా యేమైనదియు తెలియలేదు. ఆమె నెన్ని బాధలు బెట్టుచుండిరోయని ఊహించినపుడు గుండె ఝల్లుమనుచున్నది. ప్రస్తుతము నేను యిక్కడ పడుబాధలకు అంతమున్నట్లు కాన్పించలేదు. వేళకు అన్నము లేదు. దప్పికిలేదు. కప్పుకొనుటకు ఒక పేలికయైనను లేదు. నిరంతరము దహించుచుండెడి క్షుదాగ్ని చేతను, నా ప్రేయసికై కుములుచుండెడి శోకాగ్ని చేతను నేను దహించివేయబడుచున్నాను. నిరశనవ్రతముచే నశించిపోవుదమన్న ప్రేయసిని యెప్పటికైనను చూడగలననెడి పేరాశ జీవింపనిచ్చగించుచున్నది. ఇష్టమున్నను నే నిక ఎంతకాలమో జీవింపనేరను. నా యారోగ్యము పూర్తిగ చెడినది.......ఇంతకు నా ముద్దుల.......సోఫియాను.......ఒక్కసారియైనను చూడగలనా?......" అని వెక్కివెక్కి యేడ్వసాగెను. గంభీరహృదయముగల ఆల్బర్టు గబాలున నేలపై చతికిలబడి పెద్దనిట్టూర్పు విడిచెను. పృథ్వి కంపించుచున్నట్లతనికి కాన్పించినది. తల తిరుగసాగినది. 'ప్రేమకై - ప్రేమసమస్యలందు - ఇట్టి నిష్కల్మష చరిత్రలు - వందలు - వేలు ప్రాణములు విడుచుచుండగా......పిరికివాడవై, స్వార్థపరుడవై, నికృష్టుడవై........ఆ నిష్కల్మషచరిత్రయగు మేరీని కాలప్రవాహమునందు విడిచి - ఆమె నాశనమునకు కారకులైన నాజీలకు మేటిబంటుగ నుంటివిగదా నీచుడా!!!" అని యెవరో వేయికంఠశోషలతో యెత్తిపొడిచినట్లు ఆల్బర్టునకు తట్టినది. తన గతజీవితపుమెట్ల నొక్కొక్కదానిని తిరిగి జ్ఞప్తికి దెచ్చుకొనసాగినాడు. ఒక్కొక్క విషయము నాతడు జ్ఞప్తికి దెచ్చుకొనునపుడాతని హృదయమున కొక్కొక్క సమ్మెట దెబ్బ తగలసాగినది - తన కళాశాలజీవితము - ప్రేమస్వరూపురాలైన ఆ మేరీ స్నేహము - ఆమెయొక్క నిష్కల్మష స్వార్థత్యాగము - తనకై ఆమె తల్లిదండ్రులతో సహాయపడిన యిక్కట్టులు - తుదకు తనకై వారు నాజీ యాగ్రహమునకు గురియగుట - వారిజాడల నారయక యె తాను వారిని విస్మరించియుండుట - మొదలగు యీ విషాదపూర్వ గాధలన్నియు ఆల్బర్టు మానససముద్రమందు కల్లోలముదయింపజేసినవి. ఆల్బర్టు తన ప్రవర్తన

గురించి తానే సిగ్గుపడసాగినాడు. ఆలోచించిన కొలది జీవితముపై నాతనికి రోత పుట్టసాగినది. పరిభవింపబడిన వానికంటె పశ్చాత్తాపము పడువాని హృదయబాధ గొప్పది. పశ్చాత్తాపముచే పరితపించు ఆల్బర్టు ఆ నిర్బంధితుని చెంతకు జేరి "సోదరా! నీవలెనే యిట్టి యిక్కట్టులకు లోనైనవా రింకనుగలరా? వా రెచ్చట బంధింపబడిరి?"

నిర్బంధితుడు - "నాకంటెను బాధలకు లోనైన వారు వందలకొలది గలరు. కొందరు ఆకటిబాధచే కృశించి నశించిరి. కొందరు ఆత్మహత్యలు గావించుకొనిరి. కొందరు విషప్రయోగమువలన మరణించిరి. జీవచ్ఛవములై మిగిలియున్నవారు ఈ రైను నదీ తీరమందున్న యీ పురాతనపుకోటలలో బంధింపబడియున్నారు. వినుటకే వారి చరిత్రలు బాధకరముగానుండును. సోదరా నీవెవరు? నావలెనే నాజీ యాగ్రహామునకు గుఱియైన జీవివా?"

ఆల్బర్టు - "పాపము శమించుగాక! సోదరా నే నట్టిభాగ్యమునకు నోచుకొనలేదు. పిరికిపందనై వచ్చిన యువకాశమును పోగొట్టుకొంటిని. సోదరా! మేరీ....... ఆమె నామ ముచ్చరించుటకైనను తగని నీచుడను......మేరీ అను నొక యూదుల కన్యను నాజీలు బంధించి యీప్రాంతములకే తెచ్చినట్లు వింటిని. ఆమె చరిత్ర నీకేమైనా తెలియునా?"

నిర్బంధితుడు - "మేరీ.. ...మేరీయా? ఏ మేరీ?...ముసలి తల్లితండ్రులుగల ఆ యువతియా? - ఆమె తండ్రి కోటీశ్వరుడట......ఆమెయేనా?"

ఆల్బర్టు ఆత్రముతో "ఔను."

నిర్బంధితుడు - "కటకటా!!! ఆమె తల్లిదండ్రులతో సహా పడినబాధలు...... దేవా......వర్ణనాతీతము. నా ప్రస్తుతపు స్థితి ఆమె పడినబాధ ముందు స్వర్గముగా నెంచవచ్చును. అబ్బా! ఎంతదుర్భర మనుభవించినది!! ఆమె తండ్రి, ఆ ముసలివాడు కోటీశ్వరుడట. వారి ముగ్గురను యీ ప్రక్కగదిలోనే బంధించిరి. ధనమంతయు యెక్కడ దాచిరో చెప్పుడని వారిని పెట్టిన బాధలు వర్ణనాతీతము. ధన మెక్కడ దాచిరో చెప్పువరకు తిండిపెట్టము అని చెప్పి కొన్నివారములవరకు వారిని క్షుదాగ్నికి గురియగునటుల జేసిరి. తిండిలేక కృశించి నశించువారిని పూర్తిగ నశించిపోకుండగ మరల కొద్దిగ భోజన మిడుచు వచ్చిరి. ఇట్లు వారిని శల్యావశిష్టులుగ జేసినను వారు ధనము దాచినచోటు చెప్పలేదు. అంత వారి గదియంతయు మలము మొదలగు దుర్గంధపువానితో నింపి కొన్ని నెలలు కిటికీలుకూడ మూసివేసి యుంచిరి. అప్పటికిని వారు చెప్పలేదు. అంత నా ముదుసలుల యెదుటనే ఆయువతిని అవమానము చేయుటకై నాజీయువకులు యత్నించిరి. అపు డా ముదుసలి తల్లి



సింగపూరునందలి బర్మీయుల దేవాలయము.



వస్త్రధారణయందు నూతనపద్ధతులను లండను నగరమున ప్రదర్శించుచున్న జర్మను స్త్రీలలో వధువు వేషము.



మిసర్స్ అగ్నిస్ షా, కాన్పూరు కర్మాగార పరిశీలనోద్యోగిగా నియమింపబడిన ప్రథమభారత క్రైస్తవస్త్రీ.

దంప్రులు చేసిన రోధనభూమి పునాదులను గదల్చివై చునదిగయుండెను. అసహాయులై వారు పెట్టుఘోష సృష్టిని కంపింపజేయు చుండెడిది.

అబ్బా! వారి బాధలు వర్ణించలేను. ఆమె నీకేమగును?''

ఆల్బర్టు - "...తున కామెగతియేమై నది''అని గద్గదకంఠముతో కన్నీరుకార్చుచు అడిగెను.

నిర్బంధికుడు - ఏమో! యేమైనదో నాయుస్థలునావి.

వెంటనే ఆల్బర్టు ఆప్రక్కగదిలోనికిపోయి పరీక్షింపసాగెను. గదియంతయు దుర్గంధభూయిష్టమైయుండెను. అచట నిలుచుటకే మనసొప్పకుండెను. అట్లున్నను ఆల్బర్టుగదిలో నలుదిక్కులు పరీక్షించెను. అందొకగోడపై మూలనిట్లు వ్రాయబడియున్నది.

"హృదయముగల మానవున కొక్క మనవి. యూదులమైన మమ్ములను నాజీ యువకులు పెట్టిన బాధలు వర్ణనాతీతములు. తిండిలేకపోవుటచే ముదుసలులైన నాతల్లి దండ్రులు మలమలమాడి నా యెదుటనే...కటకటా-ప్రాణములు విడిచిరి. అవమానముచేయుటకై నాజీయువకులు నన్నెన్నియోసార్లు నిర్బంధించిరి. నాశక్తికొలది ప్రతిఘటించుచు తుదకు మూర్ఛజెందెడిదానను - ఇంకముందు నాగతి యేమి కానున్నదో...ఇట్లు మేరీ."

దానిక్రింద మరియొక వ్రాతలో యిట్లు వ్రాయబడియున్నది.

ఈ పై వ్రాతవ్రాసిన కన్యను నాజీలు పెట్టిన బాధలు వర్ణనాతీతములు. ఇంతకూ ఆమె తాను ప్రేమించిన యువకునిపేరు చెప్పినయెడల ఆమెబాధలు తగ్గియుండెడివి. ఆయువకునికేమి వాటిల్లునోఅని యామె చెప్పలేదు. నన్ను యిచ్చట బంధించిన మరుదినమున ఆమెను గొంపోయిరి. అప్పటికామె జీవించు యాశలేదు.......బహుశః మరణించియుండును.

ఇట్లు హతాశుడైన ఒక నిర్బంధితుడు"

ఇది చదివినవెంటనే ఆల్బర్టునకు మానవహృదయము తాళలేనట్టి శోకమువచ్చినది. ఇంతకును తనకై యామె శ్రమపడి మరణించెనుగదా యనెడి ఆలోచన యాతని గుండెను చీల్చివేసెను. కంపిత హృదయముతో నాతడు కూలిపోయెను. హృదయము చితికెను. నోటనుండి రక్తము స్రవించుచుండెను. ప్రేమ సమస్యయొక్క పర్యవసానములిట్టివా?

# పాకకళ

## — సొజ్జప్పాలు —

మైదాపిండి, గోధుమనూక, పంచదార తూకములో సమానముగనుండునట్లు తీసుకోవలయును. తరువాత ఒకగిన్నెను పొయ్యిమీదవుంచి, అందు గోధుమనూకనుకొలిసి, అదిఎంతవుండిన అన్నినీళ్లను అందులోపోసి, ఆనీళ్లలో తెచ్చిన పంచదారనుపోసి బాగుగా కలియబెట్టవలెను. అది పాకమువలె తయారగును. అందు గోధుమనూకనుబోసి కలియబెట్టి ఉడుకబెట్టవలెను. అయ్యదిబాగుగా నుడికినవమ్మట పొయ్యనుండిదింపి, ¼ వీశ గోధుమనూకకు 3 తులముల పటికబెల్లమువంతున పటికబెల్లమును మెత్తగానూరిన పొడుమును, అందు కలుపవలెను. తర్వాత ద్రాక్షపళ్లు, బాదంపప్పు, ఏలకులచూర్ణము గూడ కలుపవలెను. ఇది ఒకచోట నుంచుకొనవలెను.

| రాబోవు మాసమునుండి బెంగాలీమిఠాయినిగూర్చి వ్రాయబడును. |
|---|

అప్పుడు తెచ్చిన మైదాపిండిని, నీళ్లలోకలిపి బాగా పాకమువచ్చునట్లుగా మర్దించి, పెద్దవుండవలె చేయవలెను. దానిలోనుండి కొంచెము పిండివుండను తీసుకొని (అప్పడము పిండివుండవలె) ఒక నూనెతడిచిన అరటిఆకుపై అప్పడమువలె చేతితో వత్తి పైనుంచుకొనియున్న గోధుమనూకవుండను కొంచెము దానిపై నుంచి ఆ అప్పడముతో దానినిమూసి మరల దానిని బొబ్బట్టువత్తినట్లుగావత్తి, కాగుచున్న నేతిలో వేయించవలెను. వేడివేడిగా తినినయెడల రుచిగానుండును.

## — వేవిళ్ల వెలక్కాయలు —

మైదాపిండిని, పంచదారను సమానముగా తూచుకొనవలయును. పంచదారను మెత్తగాదంపవలెను. ఆతరువాత మైదాపిండిని బూరెలమూకుడులోపోసి (పట్టిదానిని) ఎర్రగాఅగువరకు వేయించవలెను. (మాడబెట్టకూడదు.) వేగినతర్వాత దానిని దంపిన పంచదారలోవేసి కలిపి, అందు ఏలకులపొడుమును, ద్రాక్షపండ్లను వేసి, ఆవచ్చినగుండలో బాగుగా కాగిననేతిని చాలినంతవరకు వేసి మినపసున్నివుండలు చేసేవిధముగా ఆగుండనుగూడ చేతులతో రొక్కి వుండలుగాచేయవలెను. ఇదిచేయుట చాలసులభము. అవి వేడిగానున్నప్పుడు తినిన చాల రుచికరముగా నుండును.

N: B:— మైదాపిండిని వేయించునపుడు అది బూరెలమూకుడుకు అంటుకొనకుండ కలియబెట్టుచుండవలెను. ఎర్రగా వేగినతర్వాత కమ్మనివాసన కొట్టును. అప్పుడు దానిని దింపవలెను.

— చాగంటి గున్నేశ్వరి.

## — ఆనపకాయ (సొరకాయ) పచ్చడి —

ఒక లేతఆనపకాయ మనకు కావలసినంత సన్నముగా దూటవలె తరగవలెను. కొంచెము వుప్పువేసి పిండవలెను. తరువాత ముక్కలకు సరిపడు పెరుగు తీసుకోవలెను. పెరుగులో కొంచెము పసుపు ఉప్పు పచ్చిమిరపకాయ ముక్కలుతరిగి వేయవలెను. ముందట తరిగినముక్కలను, బాణలిలో నెయ్యివేసి కొంచెము ఆవాలువేసి వేగినతరువాత ముక్కలు అందులో వేయించవలెను. బాగా వేగినతరువాత పెరుగులో వేయవలెను. కొత్తిమిరి ఇష్టమైతే వేసుకోవచ్చును.

— గొల్లకోట సుందరీదేవి.

# బాలపాపల
# ఆరోగ్యవృద్ధితో ఆహారవృద్ధి

బిడ్డలవయసు హెచ్చుగుకొలది జీర్ణశక్తియు సహజముగ హెచ్చగును. ఇది మనము గమనించి తగు ఆహారమును ఆయా కాలమున యీయకుండిన, సహజముగ హెచ్చుకావలసిన జీర్ణశక్తి హెచ్చుగాక మునుముందు అనారోగ్యమునకు కారణమగును.

దుర్బలముగగాక ఆరోగ్యముగ నుండిన బిడ్డలకు ఏడాదివెళ్లినపిదప గంజి వాడుక చేసి నాలుగైదు నెల లయినతర్వాత పాలు గంజి ఎప్పటివలె ఉపయోగించుచు, అలవాటుపడుటకని దినమునకు ఒకపూట మెత్తని అన్నమును ఒకటిరెండు ముద్దలు పెట్టుట మంచిది. ఈ అలవాటు బిడ్డలకు హితవుపడిననే చేయవలయును. లేకుండిన యీ అన్నప్రాశనము రెండేండ్లవరకు నిలుపవచ్చు కాని బలవంతపరచుట నవసరము. మూడుసంవత్సరముల బిడ్డలకు రెండుపూటలును అన్నము పెట్టవచ్చును. బిడ్డలకు అన్నము గంజి పాలు మాత్రమే వాడవలయును; 'పలహారము' కాని చిరుతిండికాని ఆరోగ్యముకాదు.

బిడ్డలకు అన్నము, గంజి, పాలు వీనితో పాటుగ ఆరోగ్యకరమగు బత్తాయి, పచ్చిద్రాక్ష, పచ్చిఖర్జూరము, ఎండుఖర్జూరపు పండు, కిసిమిసి, పలుచనితొక్కగల అరటిపండ్లు, బియ్యపుపేలాలు, వడ్లపేలాలు మితముగ యివ్వవచ్చును. బలమునకై చేపనూనె మొదలగు వాటినికూడ వాడవచ్చును.

బిడ్డలకు పండ్లరసము, చేపనూనె మొదలగువానిని వాడుట చాల ఉపయోగము. జీర్ణసంబంధమైన జబ్బులు కాని Rickets (ఎండురోగము) గాని వీటి వాడుకవలన దరిచేరవు.

ఈ పండ్లరసములను - పగటివేళ ఆహారపు వేళలమధ్య, చేపనూనె యితర ఔషధములు వాడినవెంటనే, యిచ్చుట మంచిది. చేపనూనె తత్సంబంధమైన ఔషధములను ఆహారముతో కలిపికూడ వాడవచ్చును.

పండ్లు వాడునప్పుడు బాగుగపండిన పండ్లనే వాడవలయును. పులుపుపండ్లు బిడ్డలకు రుచింపవుగనుక, పులుపు తగ్గుటకు రసముతో చన్నీళ్లు కొంచెము కలుపవచ్చును. రుచికిగాను, చక్కెరను యీ రసములందు కలుపవలెను. టొమాటో రసముకూడా బిడ్డలకు ఉపయోగకరమైనది. ఈ పండ్లరసమును విత్తులు లేకుండునట్లుగ వడియగట్టి, కమలా, ద్రాక్ష, బత్తాయి మొదలగు పండ్లరసమువలెనే వాడవచ్చును.

— ఎస్. శేషగిరిరావు

# సినీమా లోకము

## సారంగధర

తెలుగు టాకీలన్నంతమాత్రముననే యసంతృప్తిని గనబరచెడివారైనను సారంగధర చిత్రమును చూచిన తరువాత, కొంచెము పట్టుదలతో ప్రయత్నించుచో తెలుగుటాకీలను కొంతకాలములోపలనే యున్నతస్థితికి దీసికొనిరావచ్చునని నమ్మకమున కేడమీయకుండజాలరు.

సర్వసాధారణముగా గలుగుచుండు నీ దోషములను సాధ్యమైనంతవఱకు దప్పించి ప్రారుకంబైన్సువా రాంధ్రలోకమున నాబాలగోపాల మెఱుంగునట్టి సారంగధర చరిత్రను రమ్యముగా తయారుచేసి శ్లాఘనీయులైరని చెప్పవలసియున్నది.

సమయోచితమైన చక్కని గానము, క్లుప్తమై సరసమైన సంభాషణ చిత్రమును మరింత నాకర్షణీయముగ చేయుచున్నవి. కాని సాధ్యమైనంతవఱకు పాత్రలు సంగీతముతోడనే మాట్లాడవలయుననెడి ప్రయత్నమును పూర్తిగా తగ్గించియుండిన మరింత బాగుండెడిది.

ఇందు నటించినవారందరు తమపాత్రల చతురతతో నిర్వహించిరనియే చెప్పవలెను. సారంగధరుని జననమునకుముందు తలిదండ్రులు నోచిననోములాది జనాకర్షణీయమైన అన్నివిషయములను గూర్చి డైరెక్టరు శ్రద్ధవహించినట్లుల గన్పడుచున్నది. వీరు తయారుచేయబోవుచున్న 'శాంతతుకారాం' అను చిత్రముకూడ దీనివలెనే యన్నివిషయములందును అభివృద్ధిని గనపరచునని నమ్మకము.

---

## దశావతారములు

పూనానగరమందలి సినీటోన్ వారిచే తయారుచేయబడుచున్నది. దీనిని శ్రీయుత మంగరాజుగారు డైరెక్టుచేయుచున్నారు. లక్షలకొలది పైకము ఖర్చుపెట్టి ఆంధ్రదేశమందలి సుప్రసిద్ధ తారాగణము నందరినిచేర్చి, దశావతారములను పురాణసాంప్రదాయములతో నతినిపుణముగ తయారగుచుండు నీ చిత్ర మత్యద్భుతముగ నాకర్షణీయముగ నుండునని దలంచుచున్నారు.

## భక్తతుకారాం

నూతనముగా బైలుదేరిన రోహిణీపిక్చర్సు లిమిటెడ్ ఈచిత్రమును దీయుచున్నారు. ఇందు పసుపులేటి కన్నాంబ మొదలగు నటీనటులు పాల్గొనుచున్నారు. దీనికి సంబంధించిన దృశ్యముల డైరెక్టరగు రెడ్డిగారు మహారాష్ట్రదేశమునందే దీయుచున్నారు.

## రుక్మిణీకళ్యాణము

అరవము తెలుగు కన్నడభాషలలో లక్ష్మిసినిటోన్ లిమిటెడ్ వారు బొంబాయియందు రుక్మిణీకళ్యాణమును దీయుచున్నారు.

## మోహినీరుక్మాంగద

చాలకాలమునుండియు నిరీక్షింపబడుచుండిన యీ చిత్రమును మదరాస్ మూవిటోన్ లిమిటెడ్ వారు త్వరలో విడుదలచేయుదురని తెలియుచున్నది. దీనిని కృష్ణలీలలు, సతీతులసి చిత్రములు డైరెక్టుచేసి శ్రీ చిత్రపు నరసింహారావుగారు డైరెక్టుచేయుచున్నారు.

## కనకతార

ఈచిత్రము ముగియవచ్చినది. ఎడిటింగు జరుగుచున్నది. త్వరలోనే విడుదలయగును. దీనియందు నటించిన సుప్రసిద్ధాంధ్రనటకుడగు వోమ్మెటి సూర్యనారాయణగారు కీర్తిశేషులై యాంధ్రనాటకరంగమునకు తీరనిలోటును గల్పించిరని తెలుపుటకు విచారమగుచున్నది.

# పుష్పచయము

ఆపర్చునిటీమాగజీనులో కె. దివాన్‌గారు వ్రాసినవ్రాతలను చూచినవారు ఇంకను స్త్రీలయెడపురుషులకుగల సంకుచితాభిప్రాయములకు గర్హింపకమానరు. ఒకానొక వ్యక్తిని మనమునందుంచుకొని సిద్ధాంతీకరించుట మిగుల సాహసము.

"స్త్రీయొక్క ముఖ్యలక్షణాల్లో అతివ్యయముతో సమానమైనది కృతఘ్నతే చెప్పాలి. స్త్రీకి ధనముయొక్క విలువ తెలియజేతెలియదు. ఇది అవసరము ఇది అనవసరముఅనేశంక ఆమెకులేదు. మితము అనేపదము ఆమె 'డిక్షనరీ'లో వెతకినాకనబడదు. అందులో నేటినవనాగరకవిలాసినికి అసలేలేదు. ఆమె ప్రతిదినము విలాసార్థము ఉపయోగించే "పౌడరు" "లిప్‌స్టిక్కు" వస్త్రాలుచూస్తే "వమ్మవమ్మకపో" అనే వ్యాపాలు చదివేవాళ్లకుకూడా ఆశ్చర్యమౌతుంది. ఖర్చువిషయంలో జంకులేదు సరిగదా భర్తకువచ్చే ఆదాయానికిమించిన ఎత్తులు వేస్తూఉంటుంది. ఈకరువురోజుల్లో భర్తపిల్లాగో అష్టకష్టాలుపడి కుటుంబపోషణకు తంటాలుపడుతూవుంటే ఆమె మంచినీళ్లలాగ ఖర్చుపెడుతూ ఆనందాబ్ధిలో మునిగితేలుతూ ఉంటుంది. జీవనంవెళ్లబుచ్చడానికి భర్తఆలోచిస్తూవుంటే భార్య "టాయిలెటు" టేబిలువద్ద కాలం గడిపేస్తూ ఉంటుంది.

అరూన్లాబ్లూము అనేఆమె స్త్రీలస్వభావాన్నిగూర్చి చెప్పింది. "మగవాళ్లని నీచులనీ, లోభులనీ, నిరంతరమునిందించుట ఆడవాళ్లస్వభావము. ఆదాయానికిమించిన వ్యయమువల్ల వచ్చేపాట్లు వీళ్లకు తెలియక మగవాళ్లని అప్పులపాలుచేస్తుంటారు. అట్టివిషయంలో స్త్రీలకంటెనీచులు వేరేలేరు." కాబట్టి ఆడవాళ్ల యోగ్యతను వాళ్లలో ప్రఖ్యాతిచెందిన ఆమెచెపుతూఉంటే మనము వేరే ఆలోచించాలా ?

విశ్వాసమనేది స్త్రీలకుసున్న. స్థిరత్వం అసలేలేదని షేక్స్పియరు కొన్నిశతాబ్దాలక్రితమే అన్నాడు. కాలముగడిచేకొలది అస్థిరత, చపలత్వము స్త్రీలలో ఎక్కువైపోతూ మహాకవి వాక్యాలనుబలపరుస్తున్నాయి.

నిజమైనప్రేమ స్త్రీలలో ఉందనడంకంటె పొరపాటేదిలేదు. స్థిరత్వమేలేకపోతే ప్రేమఎట్లుంటుంది? డబ్బుతో ఎక్కడలేనిప్రేమవస్తుంది. వాళ్లకోరికలు నెరవేరేవరకు ప్రేమిస్తూన్నట్లు కనిపిస్తారు. వివాహమనేది నామకార్థమే. "Business-like" గా ఉంటుంది వాళ్లప్రేమ. టోపీలుమార్చుకొన్నట్లు ప్రేమమార్చుకొంటూఉంటారు. పూర్వపుస్త్రీలు, వాళ్లనిష్కళంకమైనప్రేమ కథలక్రింద చెప్పుకోవలసిందే. వ్యభిచారవృత్తిచేసేవాళ్ల అలవాట్లు, వాళ్లవేషాలు పూర్తిగా పట్టుపడ్డాయి. స్త్రీలఆశకు అంతేలేదు. వారిని పూర్తిగా నమ్మి కాయకష్టాలపడి సంసారమీదేభర్తలకు శత్రురాండ్రై బాధలుపెట్టి కోర్టులపాలుచేసిన స్త్రీలెందరు గలరు ?

గృహనిర్వహణమందు ఇచ్ఛ స్త్రీకి అంతరించినది. గృహిణి అనిపించుకొనుటకు ఇప్పటిస్త్రీకి చిన్నతనముగాతోస్తుంది. సంఘాలలో తిరిగి నాయకత్వము వహించాలనిఉంది. (Variety) మార్పువారి ప్రధాన ఉద్దేశ్యం. దినమంతా దుస్తులమార్పుతోను, అలంకారాలతోను, స్నేహితులతోను కాలక్షేపముచేస్తుంది.

స్నేహితులకు లెక్కలేదు. స్నేహకోటిమూలమునసే స్త్రీకి ప్రతివిషయములోను మార్పు అవసరమవుతోంది. స్థిరత్వముగోల్పోతోంది. ప్రేమకు స్థానము లేకుండాపోతుంది. అలంకారాలకు అంతు లేకుండాపోతున్నాయి.

*　　　*　　　*　　　*

## అమెరికా దేశపు స్త్రీలు

'ప్రబుద్ధభారతి'లో డాక్టరు సుధీంద్రబోసుగారిట్లు వ్రాయుచున్నారు.

"ఇప్పటి అమెరికా స్త్రీలు యూరపుదేశ స్త్రీలకంటె కడుస్వతంత్రలై అన్నివిషయలందును పాల్గొనుచున్నారు. స్త్రీపురుషుల హక్కులు సమానమే. మనదేశమువారు మాత్రము ఇటీవలనే స్త్రీలహక్కులకొఱకు పాటుపడుచు తలలెత్తుచున్నారు. అమెరికాలో స్త్రీలు డాక్టర్లు, ప్లీడర్లు, జడ్జీలు, ప్రిన్సిపాలు మున్నగు ఉద్యోగములు చేయుచున్నారు. మనదేశమందువలె స్త్రీలు గృహములయందేయుండి గృహనిర్వహణమందే నిమగ్నలైయుండవలెనను నియమమచట లేదు. మగవారివలెనే స్త్రీలు అతిస్వేచ్ఛగ మెలగెదరు. అమెరికాలో ఈమార్పంతయు ఇరువదవశతాబ్దమునుండియే జరిగినది. 19 వ శతాబ్దమందు అమెరికా స్త్రీలస్థితి హీనముగనే యుండెను. స్త్రీలెల్లపుడును గృహములయందేయుండి భర్తలపై పూర్తిగ నాధారపడియుండెడివారు. అంతేగాక స్త్రీలు నీచముగ చూడబడుచుండెడివారు. మార్టిను లూథరుఅనుకని 16 వ శతాబ్దమున నిట్లువ్రాసెను. "Let women bear children till they die of it; that is what they are for." స్త్రీ మగవాని విలాసవస్తువుగ పుట్టబడినదని భావించెడివారు. 'చర్చి'లోకూడ స్త్రీలకు స్థానము లేదట. సెంటుపాలు ఇట్లనెను. "Wives submit yourselves unto your husbands as unto the Lord. Let your women keep silence in the churches; for it is not permitted them to speak." కానను "లా"లో ఇట్లుండెను: "The head of every man is christ and the head of the woman is the man."

ఒక శతాబ్దముక్రిందట యునైటెడు స్టేట్సులో పురుషులకులోబడి స్త్రీలు బానిసలుగ పరిగణింపబడెడివారు. కాని ఇప్పుడంతయు తారుమారైనది. స్త్రీవిద్యయే దీనికంతకును ముఖ్యకారణము. అమెరికాలో యెక్కడచూచినను స్త్రీలకళాశాలలే. కళాశాలలే స్త్రీనింతవరకు తేగలిగెను. నేడు సాంఘిక రాజకీయ ఆర్థికవిషయ క్లిష్టసమస్యలను పురుషులకంటె ముందు స్త్రీలే పరిష్కరించుటకు సాహసించుచున్నారు. పూర్వము స్త్రీలకు వోటుహక్కు లేదు. నేడు అన్నిహక్కులను సంపాదించి స్త్రీలు పరిపాలనావిధానములో ఉన్నతస్థానములబడసి సహాయపడుచుండిరి.

ఫెడరలు గవర్నమెంటులోకూడ స్త్రీలకుస్థానముగలదు. ఇపుడు తొమ్మండుగురు సభ్యురాండ్రు గలరు. యునైటెడ్ స్టేట్సులో "కాబినెటు" మెంబరు స్త్రీయే.

*　　　*　　　*　　　*

## ఎక్కువ తెలివిగలవారెవరు? స్త్రీలా? పురుషులా?

స్త్రీపురుషులలో ఎక్కువ తెలివిగలవారెవరను సమస్య డాక్టరు వీన్లాండుఅను ఉపాధ్యాయుడు పరిష్కరించెను.

కొలరాడో కాలేజిలో 115 మంది పురుషులును, 111 మంది స్త్రీలును పరీక్షకు హాజరుకాగా స్త్రీలకును, పురుషులకును, సరాసరిమార్కులు సమానముగావచ్చెను.

అతడే మరియు నాలుగువిశ్వవిద్యాలయముల స్త్రీపురుషులనుకలిపి పరీక్ష చేసెను. ఆపరీక్షకు 3,175 పురుషులును, 1,575 స్త్రీలును హాజరైరి. అందులో 75.4% పురుషులును, 75.2% స్త్రీలును గెలుపొందిరి.

హార్వర్డు విశ్వవిద్యాలయమున ఆత్మతత్వపోటీపరీక్షలో ఎక్కువమార్కులు ఒకబాలునకును, బాలికకును సమానముగ వచ్చినవి. వీటినిబట్టి స్త్రీపురుషులు సమానతెలివిగలవారని రుజువుచేసెను.

అదియునుగాక స్త్రీలకు అనుకూలముగాని ఉద్యోగములలోకూడ చేరి పనిచేయుచున్న స్త్రీలసంఖ్య ఈక్రిందివిధముగనున్నవి.

| | |
|---|---|
| డ్రాఫ్ట్సువుమను | 2,000 |
| కాలేజీప్రొఫెసర్లు | 10,000 |
| ప్లీడర్లు, జడ్జీలు | 1,800 |
| బ్యాంకుఉద్యోగములు | 4,000 |
| షావర్సు (మోటారుడ్రైవరు) | 1,000 |

కాన, స్త్రీలు పురుషుల కంటెమాత్రము తీసిపోరనియు, చిన్నతనమునుండియు స్త్రీలకు పురుషుల వలెనే విద్యగఱపి అవకాశముగల్పించినచో పురుషులకు మించెదరనియు, లీన్హాండు తెలిపెను.

* * * *

దాంపత్యసౌఖ్య మసంభవమా ?

పరస్పరప్రేమ సహజముగనుండినగాని దాంపత్య సౌఖ్యముకలుగదు. అట్టి పరస్పర ప్రేమగల దంపతు లుండుట సంభవమా? అట్టిచో యేపరిస్థితులలో సమకూడునో యాలోచించుట మంచిది.

అన్ని దేశములలోను పరస్పర ప్రేమగల దంపతులు చాలమంది గలరనుటకు నిదర్శనములుగలవు. ఫ్రాన్సులో "బెల్లిలాలు" అను గొప్పపండితుడు తనభార్య చనిపోయినవెంటనే విషముత్రాగి మరణించెను. సామ్యవాదమంత్రి యొకడు చనిపోగానే నాతనిభార్య ఆత్మహత్యచేసికొన్నదట. ఈవిధముగ అనేకచోట్ల భార్యాభర్తలలో వారి ప్రేమాధిక్యమున నొకరిచనిపోయినచో రెండవవారుకూడ ఆత్మహత్యచేసికొనుట వినుచున్నాము. అట్లుచేయుట నొకరిపై నొకరికుండు అనంతప్రేమయే కారణము.

ఇట్టివి హిందూదేశమునకు గూడ క్రొత్తగావు. ఎందరో ప్రేమదంపతుల చరిత్రలు వినుచునేయున్నాము. బ్రిటిషు రాజకీయవేత్తలలో సుఖమైన దాంపత్యముతోనున్న వారనేకులుగలరు. జాన్ర స్సెలుప్రభు దంపతుల ప్రేమనుగూర్చి వారి గోరీమీద శిలాక్షరములతో చెక్కబడియున్నది. గ్లాడుస్టోను, డిస్రెయిలీగార్ల సంసార జీవితము లాదర్శప్రాయమైయున్నవి.

దాంపత్యసౌఖ్యమున కవకాశములగు విషయములు మెండుగలవు. మంచిదంపతుల జీవితములబరికించి చూచినచో వారి దాంపత్యము ప్రేమతో ప్రారంభమయి, క్రమక్రమముగా స్నేహములోనికిదిగి తర్వాత అనురాగములోనికిని పిదప విశ్వాసములోనికిని మారుచుండును. మనదేశమునజరుగు వివాహములలో కొన్నితప్ప చాలవాటికి ప్రేమతో ప్రారంభమగుటలేదు. అట్లు జరుగుటకు వధూవరుల కవకాశములు చిక్కుటలేదు. ఏలన వారితల్లిదండ్రులే వారికినచ్చిన మంచి సంబంధములనుకుదిర్చి వివాహములుచేయుటయు

వధూవరులందుల కంగీకరించుటయు వాడుకయ్యెను. అట్లు వివాహమైన దంపతులుకలిసి కాపురముచేయుట వలన కొంతకాలమునకు స్నేహమేర్పడి దానినుండి ప్రేమానురాగములుకలిగి సౌఖ్యజీవనము చేయుచున్నారు. అట్టివారే మనలో నూటికి ముప్పాతికమంది గలరనుట కించియు సందేహింపబనిలేదు. కాని మరికొందరు మాత్ర మాదాంపత్యమునం దిష్టపడక భర్తభార్యను వదలుటయో లేక జీవితమంతయు పరస్పరభేదములచే బాధపడుటయో జరుగుచుండును. పెండ్లియనునది భార్యాభర్తల నెడతెగని ప్రేమబంధమున గట్టిజేయుటే. పరస్పరప్రేమ కలుగుటకు సౌందర్యము, అవయవ సౌష్టవముగూడ ముఖ్యవిషయములే. దంపతులలో నెవరైన దుర్బలులైనచో దాంపత్యమెన్నటికి రాణించదు. గాన ఈవిషయములు చక్కగ గమనించుకొని పరస్పరము ప్రేమించుకొని వివాహమాడుదంపతుల కెల్లెడల సౌఖ్యముండును.

వివాహానంతరము భార్యాభర్తల ప్రవర్తనలబట్టిగూడ దాంపత్యసౌఖ్య మనుసరించియుండును. దంపతు లిరువురును మంచి స్వభావముగలవారై యుండవలయును. ఒకరిలోపములనొకరు సవరించుకొనుచుండవలెను. భార్య భర్తను ఎల్లపుడును సంతోషపెట్టుచు తగిన సలహాలనిచ్చి తెలివిగ సంచరించవలెను. ఇట్లు సమర్థించుకొనుచుపోయిన దాంపత్యసుఖమునకు కొఱతరాదు. బంధువులు, స్నేహితులు, భోజనము, వేష భాషలు, శిశుపోషణమున్నగు విషయములలో భేదాభిప్రాయములున్నప్పటికి యిరువురకు అనుకూలముగు విధమున పరిష్కరించుకొనవలెను. ఒకప్పుడు స్వల్ప కలహములువచ్చినను వారి ప్రేమానురాగములకు కొఱత రాదు సరిగదా వినోదముగకూడ నుండును.

సంతానము కలిగినపిదప ఒకరిపైనొకరికి ప్రేమానుబంధ మెక్కువగును. పిల్లలయాట పాటలతో వారు మిక్కిలి యానందించుచు వారికి విద్యాబుద్ధులు గఱపుచు అంత్యకాలమున జీవితము సౌఖ్యప్రదముగ జేసికొందురు.

*　　　*　　　*　　　*

## శుక్రవారము గర్హింపబడుటెందులకు ?

ఆంగ్లేయులు శుక్రవారము చెడుదినముగా పరిగణింతురు. ఏలయన, శుక్రవారమునాడే క్రీస్తు మృతి నొందెను. ఆదము, ఈవు నిషేధింపబడిన ఫలమునుభుజించి శుక్రవారమే చనిపోయిరి. ఫ్రెంచివారు ఇంగ్లండుపై దండెత్తి బ్రిటిషురాజుచే తఱుమగొట్టబడెను. ఈ యుద్ధము 6 డిశంబరు 1745 వ సంవత్సరమున జరిగెను. ఆనాడు శుక్రవారము. దీనినే ఇంగ్లీషువారు "బ్లాకుఫ్రైడే" అని పిలుతురు. శుక్రవారపు శీతోష్ణస్థితి సంతోషకరముగనుండదనికూడ వారి నమ్మకము.

అంతేగాక శుక్రవారము నవ్వినవాడు ఆదివారము ఏడ్చెదరను ఇంగ్లీషు సామెతగూడ గలదట.

*　　　*　　　*　　　*

## సముద్రములలో త్రాగుటకు మంచినీరు

సముద్రములో మంచినీరుదొరుకు ప్రదేశములనేకముగలవు. అట్లాంటిక్ మహాసముద్రములో దక్షిణ అమెరికాతీరమున అమెజానునదీముఖద్వారమున చాలభాగము మంచినీరే. ప్రతిక్షణము నదినుండి కొన్నికోట్ల ఘనపుటడుగల పరిమాణముగలనీరు సముద్రములోపడుటచే తీరమునుండి 200 మైళ్లదూరమువరకు మంచినీటి మయమే. నావికులది వరప్రసాదమని తలచెదరు.

ఆస్ట్రేలియాలో తూర్పుతీరమున సముద్రములో మంచినీటియూటలు విస్తారముగలవు. నావికు లచటి నీటిని తోడుకొని జాగ్రత్తపెట్టుకొనెదరు. మఱియు దక్షిణదీవులప్రాంతసముద్రపు లోపలిభాగమున మంచి నీటిప్రవాహములు మెండుగలవు అచటనివసించువారు సముద్రములోనికిదిగి పరీక్షించి మంచినీటియూటల కనుగొందురు. ఇంకను అనేకచోట్ల సముద్రములలో పైన ఉప్పునీటితో కప్పబడిన మంచినీటిప్రవాహము లెన్నిగలవో.

* * * *

## మనుష్యుని మోయగల పుష్పము

ఆమెజానులోయలందు సరస్సులలో వింతపుష్పములు గలవు. వాటి ఆకారము తామరపుష్పముల వలెనుండును. దళములు గుండ్రముగ 7 అడుగుల వ్యాసముగల్గియుండును. దళములచుట్టును 6 అంగుళ ములయెత్తున పైకిమడువబడియుండును. పైభాగమున ఆకుపచ్చగను అడుగుభాగమున ఎఱ్ఱగనునుండును. కొన్ని దళములకు రంగుభేదముండును. ఆపుష్పముపై మనుష్యు డెక్కి నిలిచినను వంగిపోదట.

* * * *

## పాలనుండి బొత్తాములు చేయుదురు

చిక్కటిపాలను పులుపుపదార్థముచే పెరుగుగామార్చి ఆపెరుగును బాగుగఎండబెట్టి పొడుముగా చేయుదురు. ఈపొడుమును ఏదైననొక క్షారముతో కలిపి రంగుపదార్థము వేయుదురు. అదిచాలగట్టిపడి ఏవస్తువు చేయుటకైనను ఉపయోగపడును. అనుద్దను బొత్తాములు, ఎలెక్ట్రికుస్విచ్చిలు, సిగరెట్టుహోల్డర్లు, దువ్వెనలు మున్నగు పలురకములవస్తువులు అన్నిరంగులలోను తయారుచేయవచ్చును. కొమ్ము వస్తువులవలె ఇవి గట్టిగను, నున్నగను ఉండును. ఇవి త్వరగా నిప్పంటుకొని మండవు.

* * * *

## కెనడా నామకరణము

పూర్వము కార్టెరియలు అను పోర్చుగీసు నాయకుడు హిందూదేశమునకు మార్గము కనుగొనుటకై బయలుదేరి సెంటులారెన్సునరకు వచ్చెను. అతనివెంట వచ్చినవారందరు ఆశాభంగముజెంది "కెనడా" యని అఱచిరి. పోర్చుగీజుభాషలో "కెనడా" యనగా ఏమియులేదని యర్థమట. అచటనున్నవారందరు యది విని ఈపదమును ఎక్కువగా వాడుకొనుచుండిరి.

తర్వాత కొంతకాలమునకు ఇంగ్లీవారచటికి వెళ్లిరి. అపు డచటివారందరును వచ్చినవారిని "కెనడా" యని నమస్కారముచేసిరి. కెనడాయనుచు పోర్చుగీసువారు వెళ్లిపోయిరి. అందుచే కెనడాయనియఱచిన ఇంగ్లీషువారుకూడ పోయెదరని వారుఅభిప్రాయపడిరి. కాలముగడచినకొలది కెనడాయనుపదమే యీప్రదేశ మునకు నామమయ్యెను.

# ఎన్నికల తమాషాలు

ఈ ఎన్నికల్లో చాలామంది స్త్రీలు వచ్చి వోటుచేశారు. వీరంతా వోటుచేయడానికి ముందు భర్తపేరు చెప్పవలసి వచ్చినప్పుడంతా ఎన్నికల ఉద్యోగుల్ని ముప్పతిప్పలు పెట్టారు. ఒకావిడ మదరాసులో వోటివ్వడానికి వెళ్లి భర్త పేరు అడిగితే చెప్పకుండా తుదకు బలవంతాన 'నటరాజదేవుడుండే వూరిపేరు మావారిది' అందట. ఆఫీసరు నవ్వుతో 'చిదంబరమా' అంటే అవునన డానికికూడ జంకుతూ తలవూపిందట.

*　　*　　*　　*

రంగురహస్యాన్ని తెలియని వాళ్లక్కడక్కడ చాలా తమాషాలు చేశారు. ఒక చదువురాని వోటరు తమిళదేశంలో "వోట్లు నా స్నేహితునికిస్తా" నన్నాడట. 'అతనికి పెట్టె వేరే లేదయ్యా' అంటే, 'అయితే ఎవరికీ యివ్వదలచుకోలేదు' అని అన్నాడట.

*　　*　　*　　*

ఇంకో ఆయన "క్రొత్తరాజ్యంలో యిష్టము వచ్చినవారిని ఎన్నుకోనవచ్చునన్నారు. ఇక్కడున్న వాళ్లు నా కెవరూనచ్చరు, ఇదంతా మోసంలాగుంది" అని కోపపడ్డాడట.

*　　*　　*　　*

కొంతమంది వోటుచీటీలు ఏమిచేయాలో ఎవరికి ఏపెట్టెలలో వేయాలో తెలియకుండా ఆఫీసరే వోట్లు కావలసినచోట వేసుకుంటాడని టేబిలు మీదనే విడిచివచ్చారట. ఇంకోచోట ఒకడు వోటుచీటిని చింపి పెట్టెలో వేశాడట.

*　　*　　*　　*

సింధురాష్ట్రంలో ఒక యువకుడు "నాకు వోటిస్తే యివ్వండి; లేకుంటే చస్తా"నని ఒక అట్ట మీద వ్రాసుకుని వీధులవెంబడి తిరిగాడట. అంతేగాకుండా ఒకసభలో మాట్లాడుతూ కత్తితో చేతిమీద పొడుచుకొని రక్తంకార్చి చూపాడట.

*　　*　　*　　*

ఎంతోమంది ఒకరికే బదులుగావచ్చి వోటు చేశారు. కొంతమందిని కనుకొన్నారుకూడ. వారిలో ఒక ముసలివాన్ని ఎందుకలా చేశావని అడిగితే 'కొడుక్కు జబ్బుచేసింది. వాడికి బదులువచ్చా'నని బదులు చెప్పాడుట.

*　　*　　*　　*

అంబాలాలో ఒకావిడకి వోటు ఎలాచేయవలసింది తెలియకుండా ఎన్నికల్లో పనిచేస్తావున్న ఇంకొకావిడను అడిగిందట. ఆవిడ వోటింగు సమాచారమంతా చెప్పగా విని "నీపెట్టె ఎక్కడుందో చెప్పితే నీకే వోటిస్తా చూపించు" అందట రామాయణమంతా విని రామునికి సీత ఏమికావాలె అన్నట్లు.

*　　*　　*　　*

పంజాబులో ఒక కుటుంబంఅంతా వోటుచేయడానికి పోలింగు స్టేషనుకు వెళ్లారు. అందులో వోటరుకు 101 సం||లు. అతని కుమారునికి 71 ఏండ్లు. మనమనికి 52 ఏండ్లు. మునిమనమనికి 31 ఏండ్లు. మునిమనమరాలుకు 12 ఏండ్లు. ఆఅమ్మాయి తాత ముత్తాతలతో తమాషా చూడడానికిమాత్రమె వెళ్లింది.

*　　*　　*　　*

కాకినాడలో ఒకావిడ సోషలిస్టుపార్టీ, కాంగ్రెసు పార్టీ పక్షమున ఎన్నికలలో నిల్చినవా రిద్దరూ సమానమంటూ పక్షపాతం చూపకుండా చీటిని చింపి రెండుపెట్టెలలోనూ వేసి చక్కాపోయిందట సమరస భావం కనపరుస్తూ.

*　　*　　*　　*

ఒకచోట ఒక మహమ్మదీయస్త్రీ తనవోటు పెట్టెలోవేసి ఆపెట్టె భద్రంగా వుంచాలంటూ దాన్ని తీసికొని బైలుదేరిందట. పోలింగ్ ఆఫీసరు అదిచూచి పెట్టెను లాక్కొని పంపించాడట.

*　　*　　*　　*

తమిళ దేశంలో కొంతమంది నిమ్నజాతుల స్త్రీలు బాలటుపెట్టెలకు పూజాపురస్కారాలు జరిపారట. ఇంకా కొంతమంది అభ్యర్థులు విజయమందాలంటూ పెట్టెలకు కర్పూరహారతు లిచ్చారట.

*　　*　　*　　*

రామచంద్రపురంలో ఒక గుడ్డివోటరు వోటు చేయడం తెలియక పోలింగుఆఫీసరునే వేసిపెట్టమన్నాడట. ఆఫీసరు 'ఓటు ఎవరికిస్తావు' అనగా 'అయ్యా! ఎవరిగోడవా నాకు తెలియదు. గాంధీ పెట్టెలో పడెయ్యండి" అన్నాడట.

# గ్రంథ పరిచయము

## సందేశ తరంగిణి (ప్రథమ ద్వితీయభాగములు)

ఈ గ్రంథములు శ్రీరామకృష్ణ శతవార్షికోత్సవస్మారక చిహ్నముగ చెన్నపురియందలి శ్రీరామకృష్ణ మఠమువారిచే ప్రకటింపబడినవి. మొదటభాగము డెమ్మి 250 పుటలు; వెల రు. 1-4-0 రెండవ భాగము 220 పుటలు. వెల రు. 1-0-0 రెండునుగలసి రు. 2-0-0.

ఇందు శ్రీ వివేకానందస్వాములవారు 1893 సం. అమెరికానందు జరిగిన ప్రపంచమతమహాసభలో వేదాంతోపన్యాసములనొసగి అసదృశదిగ్విజయముగాంచి భారతదేశమున కరుదెంచి యిచ్చిన సందేశామృతము శ్రీ తత్త్వానందస్వామిగారిచే నాంధ్రీకరింపబడినది. భారతదేశమందు కొలంబో మొదలు వివిధ పట్టణములందు ఒసగిన అద్వితీయ యుపన్యాసముల నాంగ్లము తెలియనివారెల్ల చదివి యానందించుట కనుకూలముగ నున్నది. భారతీయులయొక్కయు హిందూమతముయొక్కయు యుత్కృష్టతను ఖండఖండాంతరములు ప్రతిధ్వనింప యుపన్యాసములిచ్చి ప్రపంచదృష్టిలో హిందూమతమున కున్నతస్థానమిప్పించిన శ్రీవివేకానందులనుగూర్చి వ్రాయవలసిన అవసరములేదు; ఒకవేళ వ్రాసినను చాలదు. అట్టిమహనీయుని యుపన్యాసముల నామూలాగ్రముగ నాంధ్రీకరింపదలంచుకొన్న మఠమువారి యాశయము శ్లాఘనీయము.

## నవ్యకథానిధి

దీని రచనావిధానములో నూతనత్వముగలదు గాని కథలలో క్రొత్తవి గానరావు. దీనిని రచించిన ఉభయభాషాప్రవీణ అయినంపూడి గురునాథరావుగారు చిరకాలానుభవముగల యుపాధ్యాయులు: "ప్రాథమిక పత్రికా" ప్రధానసంపాదకులు. నేటి విద్యార్థిగణమునకు మనోవికాసము సంస్కృతియు నలవడునని తలంపుతో వీరు చాత్మకములగు నిరువదికథల నిందు క్లుప్తముగ రచించిరి. కథావస్తువుకంటె దాని వలన నేర్చుకొనునీతుల కెక్కువ ప్రాముఖ్య మివ్వబడినది. ఇది మాధ్యమిక ఉన్నతపాఠశాలల కుపయుక్తముగ నుండగలదు. వెల 0-5-0. వలయువారు కార్యదర్శి, శ్రీ శివరామ పుస్తకభాండాగారము, పెదననగల్లు, కృష్ణాజిల్లా అని వ్రాయవలయును.

## అశ్విని (ప్రథమభాగము)

ఇందు సర్వరోగములు వాని లక్షణములు, వానికి ఇంగ్లీషు, ఆయుర్వేద, సారూప్య (హోమియోపతి) జీవరసాయన (బయోకెమిస్ట్రి) ప్రకృతి వైద్యవిధానములు తేటతెల్లముగ వ్రాయబడినవి. ఇది వైద్యులకే గాక ప్రతివారికిని యుపయోగపడు గ్రంథము. తెనుగుభాషలో నిట్టిగ్రంథము లరుదు. దీనిని డాక్టరు గొడవర్తి వేంకటనరసింహాచార్యులుగారు రచించిరి. రెండవభాగముకూడ వెలువడనున్నది. ప్రథమభాగము 1937 సం. మే నెలలోపల కొనువారికి రెండవభాగము (వెల 2-8-0) ఒకరూపాయకే యివ్వబడును. ప్రథమభాగము వెల 2-8-0. వలయువారు గ్రంథకర్తగారికి చేబ్రోలు, కైకరంపోస్టు, వ్రాయగలరు.

## పండుగ కట్నము

కవి పాలెపు బుచ్చి వేంకటసాంబశివరావు, అనకాపల్లి. 'శ్రీగణపతి రాజవంశ సీతారామా' అను మకుటముతో 116 కందపద్యములు గలవు.

## హిందూసుందరి—సంక్రాంతి సంచిక

ముప్పదిరెండు సంవత్సరములుగా స్త్రీల యభ్యుదయమునకై పాటుపడుచు, శ్రీమతి బాలాంత్రపు శేషమ్మ గారిచే నడుపబడుచు నూతనకైసేతతో వచ్చిన 'హిందూసుందరి' సంక్రాంతి సంచికను ముదముతో నందుకొంటిమి. దీని సేవను గుర్తెఱిగి యాంధ్రలోకము తగినరీతి నలంకరించుటకును, ఆదరించుటకును ముందంజవేయునని యాశించుచున్నాము.

## మారుతికళ — పక్షపత్రిక.

ఇందు పండిత మదనమోహనమాలవ్యా, స్వామివివేకానంద మొదలగువారి బోధామృతమందలి విషయములను భక్తిజ్ఞానవైరాగ్యముల బోధించు నితర వ్యాసములుగలవు. కాని 'స్త్రీవిషయము' అను శీర్షికతో ప్రకటింపబడిన పాట శోచనీయముగనున్నది. స్త్రీలనుగూర్చి వ్రాయవలసిన సంగతుల విషయమై సంపాదకులు శ్రద్ధవహించుటుత్తమము. న్యాయాన్యాయముల మానుషత్వమునుమాని దేనిపేరటనో స్త్రీలను దూషించి తన్మూలమున ఆత్మదూషణకు పాల్పడు అధర్మమునకీ పత్రిక తావొసంగకుండుగాక.

ఇది ప్రతిపక్షము కంభంమెట్టు మధుసూదనరావుగారి సంపాదకత్వమున మారుతిప్రణవాశ్రమము కేశవానందనిలయము, బాపట్లనుండి వెలువడు పత్రిక. సంవత్సరపు చందా రు. 2. విడిప్రతి 0-1-0.

## విశ్వకర్మ (మాసపత్రిక)

"విశ్వకర్మలోకానికి తెలుగుపత్రిక లేనికొరత తీర్చుటకును, పత్రికద్వారా సేవ (సంపాదకులు కాబోలు) కొంతసేవచేయ తలంచితిమి, సంఘమందు చీకటినిపారద్రోలి ప్రకాశింపచేయుటకును, ఆచార, మత, సాంఘిక, నైతిక విషయములున్ను సంఘమునకు పనికివచ్చు చిన్నకథలున్ను వేరువేరుగా వితంతు వివాహం, నాట్యకళ, వనితాలోకం, పరిశ్రమలు వీనిపై వ్యాసములు ప్రకటించి మన పూర్వాచారములను ఆచరణకు తీసికొని" సంఘోద్ధరణకు బైలుదేరినది విశ్వకర్మ పత్రిక. ఈపత్రిక యెట్టిసేవచేయగలదో చదువరు లూహించుటకు పైనగల విషయములే నిదర్శనము.

ఇంకను ఈపత్రిక స్థాపించుటలోగల నుద్దేశమిది; "మన హక్కులకు గవర్నమెంటువారితో పోరాడుటకు సర్వదా ప్రయత్నించుదము. అంతేగాని మాపత్రిక ఒకపక్షమునకు చెందినదిగాదు." కాని యీ రాజకీయసిద్ధాంతము తరువాత నాలుగైదుపుటలకే మారి జస్టీసుపార్టి తమ సంఘమున కెక్కువ మేలుజేసినది గాన రానున్న ఎన్నికలందు అందరు దాని విజయమునకై సాయపడవలయుననియు ప్రచారముచేసినది. పత్రిక యొక్క యాశయములవలెనే రచనలుకూడ గలవు ఇట్టిధోరణిలో నిట్టిపత్రికలు సంఘోద్ధరణకుగాని దేశాభ్యుదయమునకుగాని కించిత్తయిన నుపయోగింపవనుటలో అతిశయముండదు.

ఇది శ్రీయుత ఎస్. నారాయణాచారిగారి సంపాదకత్వమున 28, సవిరిముత్తువీధి, జి. టి. మదరాసు నుండి వెలువడుచున్న మాసపత్రిక. సాలుచందా రు. 1. విడిప్రతి 0-1-6. (రాచ)




**హిందూస్త్రీల వారసత్వపుహక్కు శాసనము**

"ప్రస్తుతపు హిందూస్త్రీలదుస్థితి అత్యంత శోచనీయము, అవమానకరము" అనియు, "హిందువులు బానిసలైన తరువాత తమ క్రింద బానిసలుగా నుండదగినవారు స్త్రీలు మాత్రమేయని దలంచిరి" అనియు లా మెంబరైన సర్కారుగారు హిందూస్త్రీల వారసత్వపుహక్కు బిల్లు చర్చకు వచ్చినపుడు వచించినదానిలో నసత్యమేమియు లేదు. కాని ప్రభుత్వమువా రిట్టి సానుభూతిని యాదరమును సంఘసంస్కరణములందు జూపుచో నిదివఱకే సంఘాభివృద్ధి కాటంకములుగనున్న పెక్కువిషయములు చక్కబడియుండును. ఇపుడైన వా రిట్టి సానుభూతి జూపుట భావిశుభోదయమునకు హేతువుగా దలంచుచున్నాము.

హిందూసంఘమందలి స్త్రీల దుస్థితికి ఆర్థికహక్కులేమి యొక ముఖ్యకారణము. ఈయన్యాయ మీనాడుమాత్రమే గుర్తింపబడలేదు. గుర్తించినవారలకంటె అధికసంఖ్యాకు లా యభిప్రాయమునకు వ్యతిరేకులై యుండుటవలన వారికట్టిహక్కు గలిగించుటకు సాధ్యము గాదయ్యెను. ఇపుడు మాత్రము? దేశమందలి స్త్రీపురుషులెల్ల రద్దాని యావశ్యకత నెఱింగి యిది శాసనము కాగోరినను, అట్లు కాగూడదని పూర్తిగా నెదిరించిన మహాశయులుకూడ శాసనసభలో లేకపోలేదు. దైవాధీనము వలన బాలారిష్టములు గడచి యీబిల్లు శాసనమైనదానికి చింతించు పుణ్యజనులును తరుగలేదు. ఏమైననేమి అన్యాయము లెంతవఱకు రాజ్య మేలగలవు?

హిందూస్త్రీలకు వారసత్వపుహక్కు గలిగించుటకు దేశముఖుగారు మొదట ఈ బిల్లును ప్రవేశపెట్టిరి. కాని ప్రభుత్వమందలి షరతులన్నిటికి నంగీకరింపక వారసత్వపుహక్కు వితంతువులకు మాత్రము వర్తించురీతి బిల్లును సవరించినచో దానిని విచారింప నొక సెలెక్టుకమిటీని నియమింతుమనిరి. ఎంతమాత్రము మేలుకలిగినను మంచిదే యను యుద్దేశముతో దేశముఖుగా రావిధమున సవరించిరి. తరువాత ఫిబ్రవరి నాల్గవ తేది సెలెక్టుకమిటి నివేదిక వాసనసభయందు చర్చకు వచ్చెను. సభ్యులును ప్రభుత్వమువారును బిల్లుయొక్క విలువను గొనియాడి శాసనమునుగావించిరి.

ఈ చట్టముప్రకారము భర్త యనంతర మాతని యాస్తి భార్యకు సంక్రమించును; ఇతరవారసు లున్నవారితోపాటు ఆమెకు కొంతభాగము వచ్చును. విద్యావంతులై మానుషత్వము నెఱిగిన యేకొలది సంసారములందో తప్ప, భర్త జీవించుకాలమునందే వ్యక్తిత్వ మెంతమాత్రము లేక బానిసగ గణింపబడుచుండు హిందూస్త్రీ భర్త యనంతర మెట్టికష్టములకు లోనగునో, బంధువు లేవిధముగ నాదరింతురో ప్రత్యక్షముగ జూచుచున్న నీ దినములలో వేరుగా వ్రాయు టనవసరము. అట్టివారల కీ శాసనము కొంతవఱకు మేలుగలిగింపగలదు.

'స్త్రీలను తమక్రింద బానిసలు'గా జేసికొని వారిమొర లెంతమాత్ర మాలింపక తమకుమాత్రము స్వాతంత్ర్యము గావలెనని పోరాడుటకు హక్కులేదని స్త్రీలయెడ నన్యాయముగ వర్తించు పురుషులు నేడు గుర్తించిరి. వీరు బహుకొలదిమంది మాత్రమగుటచే ఈ సదభిప్రాయము ఫలింపవలసి యున్నచో యుక్తాయుక్తముల గమనింపని సనాతనాచారముల ప్రమాణములగాగొని యెపుడొకేరీతిగా నుండదలంచుకొన్నవారందరుకూడ విశాలహృదయులై 'ఆత్మవత్ సర్వభూతాని'యని యనుకొనక తప్పదు.

*          *          *          *

మాతృభాష—మన విశ్వవిద్యాలయములు

ఇటీవలనే జరిగిన కలకత్తా విశ్వవిద్యాలయ పట్టప్రదానోత్సవ సందర్భమున బెంగాలు గవర్నరుగారి యధ్యక్షతను జరిగిన సభయందు విశ్వవిద్యాలయముతో నెట్టి సంబంధముగాని లేని రవీంద్రనాథ టాగూరుగారు ఉపన్యాసమిచ్చుట నూతనాంశము; అదియు వారి మాతృభాషయగు వంగభాషయందే యుపన్యసించుట యద్వితీయ విషయము. పట్టభద్రులందరు వంగదేశపు దుస్థులనే ధరించి తమ పట్టముల బొందిరి. ఇది హిందూదేశమందలి విశ్వవిద్యాలయముల చరిత్రలందు నూతనమై భావిభాగోదయసూచన ఘట్టము.

ప్రపంచమునంతయును గలంచుచుండు విషయముల నతిసులభముగ నూహించి యంతకంటె సులభముగ వాని పరిష్కారమును లోకమునకు విప్పిచెప్పి యెల్లరికి మరుగై యున్న సత్యమును క్షణములో బైటబెట్టగల ప్రతిభ మహాత్ముల వెన్నంటియేయుండును. రవీంద్రుని యుపన్యాసమును గాంచినచో భారతీయుల దీనావస్థకు మూలమైనది. మాతృభాషానిరాదరణ, నేటి పాశ్చాత్య నాగరికతావ్యాపకము—వ్యామోహములని తెలియుచున్నది. విశాల దృష్టితో గాంచిన నంతకంటె ముఖ్యమైనది వేరొండు గానము.

మానవకళ్యాణమున కేవిధముగనైన హాని గల్గించుచో నది నాగరికత యనబడదు. పాశ్చాత్య నాగరికత మానవాభ్యుదయమున కెన్నివిధముల కృషి సలుపుచున్నదో, మానవ మారణప్రయత్నము లంతకంటె ద్విగుణీకృతోత్సాహముతో

కృషి సలుపుచున్నది. మొదటిగుణమును గని మనము మోసపోయితిమి. తరువాతి గుణమును పరిశీలించిన పిదపకూడ దాని వ్యామోహమును వదలించుకొనజాలక నానాటికి అధోమార్గము బట్టుచున్నాము. ఇతరత్రయీవిషయమంత విస్పష్టము గాకపోయినను భారతీయ విద్యావిధానమున నది గనబడుచునే యున్నది.

ఈ పాశ్చాత్యనాగరికత - విజ్ఞానమును భారతీయుల బుఱ్ఱలోని కెక్కించుటకు పరదేశభాష సాధనముగానున్నది. ఇది అసహజమగుటచే విద్యావిధానము భారతీయులను బాగుచేయుటకు బదులు నిరుపయోగులను చేయుచున్నది. రవీంద్రు లన్నట్లు ఒక్క భారతదేశమందు తప్ప మరే దేశమునందైనను దేశీయులకు విద్య పరభాషలందు నేర్పబడుటలేదు. అందువలననే వానియున్నతి.

జపాను భారతదేశమువలెనే కొంత కాలమునుండి పాశ్చాత్య విజ్ఞానమును నలవఱచుకొనుటకు పూనుకొన్నది. వారి విజ్ఞానమును గైకొని తమ దేశభాషలో దానిని వ్యాపింపజేసినది. ఫలితమేమైనది? ఒక శతాబ్దములోపలనే నూరుపేరులులేక మారుమూలలనున్న నొక చిన్నదేశము ప్రపంచమందలి ప్రసిద్ధదేశములై ప్రథమ శ్రేణిలో పరిగణింపబడుచున్న ఇంగ్లండు, అమెరికా సంయుక్తరాష్ట్రములంతటి వానికి కూడ హడలు పుట్టించురీతి సర్వతోముఖాభివృద్ధి బొందినది. కాని అదే విజ్ఞానమును నూటయేబది వత్సరములనుండి పరదేశభాషలో నార్జించుచున్న భారతదేశమే స్థితికి వచ్చినది? భౌతికదాస్యమేగాక భావదాస్యమునుకూడ పుష్కలముగ సంపాదించుకొన్నది. 'స్వదేశీ'యంతయు గర్హనీయమనియు, విదేశీయ-పాశ్చాత్య-ములన్నియు ననుకరణీయములనియు దలంచి రెంటికిం జెడిన రేవడివై దుర్భరదారిద్ర్యమున మునింగి గట్టుగానక యల్లాడుచున్నది. పాశ్చాత్యదేశముల నింతటిప్రసిద్ధికి, యభివృద్ధికి దెచ్చిన పాశ్చాత్యనాగరికత - విజ్ఞానము భారతదేశము నీరీతి జేయుటకు కారణమేమి? ఎవరైనను ఏ యాహారమునైనను దిన్నచో నది జీర్ణించి ఒంటబట్టవలయునుగదా? విదేశవిజ్ఞానము మనకు జీర్ణింపవలసి యున్నచో నది మన మాతృభాషలోనే వ్యాప్తముగావలసి యుండును. అందుచే ఆలోచనాశక్తి, భావస్వాతంత్ర్యము కల్పనావేశము నభివృద్ధిజెందును. ఇంత మాత్రముచేతనే ఇంగ్లీషును మానుట మంచిదని జెప్పుటలేదు. అది అంతర్జాతీయ భాషయగుటచే నందరు మన్నింపవలసినదే. కాని మాతృభాషను మానివేయుట దేశసాభాగ్యమునకు దోడు గాజాలదు.

ఈ విషయమును గుర్తించి వంగదేశము మాతృభాషను మన్నించినది. అందుచేతనే సంవత్సరములనుండి భారతదేశమందన్ని విశ్వవిద్యాలయము లవలంబించుచున్న ప్రాతపద్ధతినిమాని భాషావిషయమున నూతనత్రోవ ద్రొక్కినది. తత్ఫలితముగా

హిందూదేశమం దన్ని భాగములలో వంగ రాష్ట్ర మన్నివిధముల యభివృద్ధి బొందినది. పొందుచున్నది. దానినే రవీంద్ర కవీంద్రు డువాకొనినది. మాతృభాషయందు విద్యావ్యాప్తి జరిగిననే మాతృభూమికి మోక్షములేదను వారి సందేశ మొక్క వంగ విశ్వవిద్యాలయమునకే వర్తింపదు గదా ! అయినచో భారతీయ విశ్వవిద్యాలయములన్నియు నీదారి ద్రొక్కనివేందులకు ? కొన్ని విశ్వవిద్యాలయములు మాతృభాషకు నితరభాషలకు వలె ప్రాముఖ్యమునకైన నివ్వనిదేందులకు ? వారికి మాతృభాషా ప్రాముఖ్య మిసుమంతైనను తెలియ దనుటకు సాహసింపగలమా ?

ఈ విధానముయొక్క ప్రాశస్త్యమును చక్కగ నెఱింగి, ఆంగ్లాంధ్ర సాహిత్యములం దసమాన మన్ననలొందిన యాంధ్రాభిమాన మెక్కుడుగా గలిగిన యాంధ్ర మహాపురుషులగు శ్రీయుత రెడ్డిగారు ఆంధ్ర విశ్వవిద్యాలయపీఠ మలంకరించిననాడే విద్యావిధాన మాంధ్రభాషలో జరుగుటకెక్కువ శ్రద్ధ వహింపబడునని యెల్లరిచే విశ్వసింపబడినది. ఈ విశ్వాసమును సత్యముగావించి తదనుగుణముగ వర్తించి యాంధ్రరాష్ట్ర మేవిధమునను ఇతరరాష్ట్రములకు వెనుకబడదని చాటి యాంధ్రాభ్యుదయమునకు దోహద మొనరింతురని యాశించుచున్నాము.

---

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.